సంస్థాపకులు
వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 20 అక్టోబర్ 1982 సంచిక 9

# ఇదీ వరుస...



ఈ నెల నవలానుబంధం

## కరి మింగిన వెలగపండు

రచన

## సౌభాగ్య

జ్యోతి, పి. బి. నెం. 1824, హైదరాబాదు-2॥

ముఖచిత్రం : శ్రీదేవి

# తొలిమాట

## మెగాసె...



వినాయకులకి చవితి వెళ్ళిపోయింది....

ఈ పండగకి ముందు ప్రభుత్వ పండగ ఇన్సాట్ పనిచేయడం!

కొన్ని కోట్ల రూపాయల భారత ఆర్థిక రూపం ఇన్సాట్‌లా పైకి వెళ్ళింది-ప్రయోజనం కొద్దిగానైనా ఆరంభించింది....ఇన్సాట్, బాంబే అఫ్‌షోర్ నిర్మాణ ప్రమాదం మన ఆర్థిక స్థితిని తెలియజేస్తున్నాయి....!

పత్రికా రంగంలో అనితర సాధ్యంగా సాహసాన్నీ ప్రతిభనీ చూపించిన డా॥ అరుణ్‌శౌరికి మెగాసె అవార్డ్ లభించడం పత్రికా ప్రపంచ ధైర్య సాహసాలకే సన్మానం....మానవ మహారణ్యంలో జరిగే అమానుషాలని ఎత్తి చూపాలంటే పత్రికా స్వాతంత్ర్యానికి అడ్డు వుండకూడదు-'బీహార్ ప్రెస్‌బిల్' కిలాగ! అరాచకానికి వ్యతిరేకంగా స్వేచ్ఛకోరే ప్రతివారూ గౌరవించదగ్గ లక్ష్యం శ్రీ శౌరిది.

త్వరలోనే మినీ కథలూ, కొత్త సీరియల్ ఆరంభమయి మీకు సంతృప్తినిస్తాయని ఆశిస్తున్నాం-మీకు నచ్చి, మీరు మెచ్చుకునేలాగ దీపావళి ప్రత్యేక సంచిక తయారు చేస్తున్నాం....

ఏరు దాటాలంటే ఈత రావాలి.

కారు నడపాలంటే జోరు కావాలి.

మరి ప్రేమించాలంటే ప్రేమిస్ట్రీ తెలియాలి.

అది తెలియాలంటే





"ఆ అనుభవం కావాలి"

చదవండి.

నవంబరు 82 సంచికనుండి ప్రారంభం,

శ్రీ వి. మోహన్‌కుమార్ సీరియల్.




నాకు నచ్చే ఏకైక మాసపత్రిక జ్యోతి. ముఖచిత్రం చాలా బాగుంది. యండమూరి వీరేంద్రనాథ్ గారి "డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు" చాలా జోరుగా సాగుతోంది. గత ఇతను, ప్రచురిస్తున్న మీకు నా హృదయపూర్వక ధన్యవాదాలు,

బొందలపాటి శ్రీనివాస్,
రావివారిపాలెం,

సెప్టెంబరు 82 జ్యోతి మాసపత్రిక చదివాము. సెలయేరులా గలగల పారుతున్న సీరియల్స్ జలపాతంలో పాఠకులు మనసారా మునకలువేస్తున్నారు. రచయిత గాంధీని కటకటాలమధ్యకు పంపుతారో పెళ్ళి పీటల మీద కూర్చోపెట్టుతారో వూహించలేకున్నాం. ఇల్లాలి సౌమ్యమే యింటికి సౌభాగ్యమని మహిళలందరికి చాటిచెపుతూంది 'సౌభాగ్యలత' సీరియల్. ఇంత మంచి సీరియల్స్ వేసి మీ(మా) ప్రతిభతో వెలుగుతున్న మా జ్యోతికి థాంక్స్.

కె. ప్రేమలత,
పెండేకల్.

సెప్టెంబరు మాసంలో "వెలుగురేఖ" చాల చక్కగా రాశారు. 'జ్యోతి' పత్రికలో చాల చక్కని కథలు అందిస్తున్నారు. ఇకముందుకూడ ఇలాగే అందిస్తారని ఆశిస్తున్నాము. చీర్ల సీతాదేవి గారికి మాయొక్క హృదయపూర్వక నమస్కారములు. ప్రేమ-పెళ్ళి నవల చాలా బాగుంది. ఎల్లపుడు ఇలాంటి నవలలే అందిస్తారని ఎడిటర్‌గారిని కోరుచున్నాము.

జి. పద్మప్రభ,
చిక్కవరపల్లి.

ఆర్యా,

నేను జ్యోతి చందాదారుడ్ని. 1982 జనవరి సంచికనుంచీ, ఆగస్టు సంచిక వరకూ 8 సంచికలూ సకాలంలో క్షేమంగా అందించిన పోస్టల్ డిపార్టుమెంటు, నిన్న నా ఎడ్రసును కలిగివున్న కాగితాన్ని మాత్రం అందించింది! తపాలాశాఖ వరాన్నభుక్కులారా! సిగ్గుపడకుండా చిరకాలం జీవించండి మీ వస్తువులను కూడా మీలాంటి పుణ్యాత్ములు ఎత్తుకెళ్ళాలని ప్రార్థిస్తూ,

ఎ. కామేశ్వరరావు,
విద్యానగర్-524 413.

## సాంస్కృతిక విజ్ఞాన విశేషాలు

### శ్రీ జి. కృష్ణకి సన్మానం

మంటలు పక్షపత్రిక వారు జగిత్యాలలో ఇటీవల ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ప్రత్యేక విలేఖరి, పండితుడు, హాస్యచతురుడు, సునిశిత విమర్శకుడు శ్రీ కృష్ణని సన్మానించారు సాంస్కృతిక సద్భావం వ్యక్తం చేస్తూ. జ్యోతి శుభాకాంక్షలు చెబుతోంది శ్రీ జి కె కి

### చెన్నపురి ఆంధ్ర మహాసభ మద్రాసు

1982 దసరా సందర్భంగా మేము "ఏకాంకిక నాటక పోటీలు" నిర్వహించ బోతున్నాము

వివరాలకు, అప్లికేషన్‌కు

సెక్రటరీ, చెన్నపురి ఆంధ్రమహాసభ
వి పి హాల్ కాంపౌండ్, మద్రాసు-3.

నింపిన అప్లికేషన్ చేరవలసిన తేదీ సెప్టెంబరు 10,



"మంటలు" పక్షపత్రిక ప్రథమ వార్షికోత్సవ సందర్భంలో ప్రముఖ జర్నలిస్ట్ శ్రీ జి. కృష్ణను చిన్న పరిశ్రమల మంత్రి శ్రీ వెంకటేశ్వరరావు సన్మానిస్తున్న దృశ్యం

జ్యోతి



నాగానీక ఆవిష్కరణ సభలో ఎడమనుండి కుడికి వరుసగా ఆచార్య బి. రామరాజు, ఆవిష్కరిస్తున్న సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ ఐ రామకృష్ణంరాజు, శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు (ఆంధ్రప్రభ వారపత్రిక సంపాదకులు), రచయిత డా ముదిగొండ శివప్రసాద్

## విస్ఫోటం

'విస్ఫోటం' సాహితీ సమాఖ్య, ఖరగ్‌పూర్ వారు తమ రెండవ ప్రయత్నంగా వెలువర్చబోయే మినీ కథా సంకలనానికి సామాజిక సమస్యల అవగాహనతో అరరావునకు మించని మినీ కథలు కావాలి. ఎన్నికయిన మినీ కథకు 10 రూపాయలు పంపించవల్సి వుంటుంది. మీ మినీ కథలు-త్రినాథ్ 'సుంకర, 4L/14, యూనిట్-16, నింపూరా, ఖరగ్‌పూర్-721304 కు అంగ్లంలో చిరునామా వ్రాస్తూ మినీకథలు అక్టోబరు నెలాఖరులోగా పంపాలి

## ఎ జి ఆఫీసు తెలుగు సాహితీ సమితి-రంజని

1982 83 సంవత్సరానికి కార్య నిర్వాహకులు - అధ్యక్షులుగా కె కె మీనన్, ఉపాధ్యక్షులుగా డి వి రావు, కార్యదర్శిగా కె రామచంద్రయ్య సహాయ కార్యదర్శిగా వి ఆదినారాయణ రావు, కోశాధికారిగా సి, సుందరయ్య, సభ్యులుగా యస్ రాఘవేంద్రరావు, రాజేశ్వరరావు, జె. రమాకుమారి, సి వి యస్ విజయకుమార్, యస్ నాలాజీ బాబుల్, వి. శివనాగకుమార్, మరియు కె విశ్వనాథ్ ఎన్నికయ్యారు

# దీపావళి వచ్చేస్తోంది!



కనుక
జ్యోతి దీపావళి ప్రత్యేక
సంచిక మీకిష్టమయ్యే
చక్కని కథలతో
ప్రత్యేకంగా
శ్రీ బాల ముఖచిత్రకాంతితో
పదిరోజులకే వచ్చేస్తుంది!
మీ ఆర్డర్ల కోసం
ముందుగా రాయండి.



వచ్చే నెల సంచికలో
మీరెదురు చూసే
మినీ కథల పోటీ
ఫలితాలూ,
ప్రచురింపబడుతాయి.
ఎదురుచూడండి.



# ! అదీ !

మినీ కథ

## ఎ. కె. రావ్

"డాక్టర్ గారిల్లిదేనా!"

"ఇదికాదు. ఇది ప్లీడర్ గారిల్లు అదిగో ఆ కొబ్బరి చెట్టున్నది డాక్టర్ గారిల్లు"

"అదేలే. మొన్న డాక్టర్ గారు కోఠీలో...."

"కోఠీలో కాదు, నాంపల్లిలో"

"అదేలే. నాంపల్లిలో కలిసినప్పుడు వాళ్లు నల్లకుంటకు యిల్లు మారామన్నారే అందుకనీ...."

"నల్లకుంట యిదికాదు. అదే"

"అదేలే. ఇది విజయనగర్ కదా. తెల్సు."

"ఇది విజయనగర్ కాదు. విద్యానగర్"

"అదేలే. ఈవిజయి..."

"విజయి-కాదు... విద్యా...."

"అదేలే ఈ విజ్ఞానగర్‌లోనేగా మన ప్రెసాదుండేది"

"కాదు ఇక్కడ మన వెంకటరావుంటాడు. ప్రసాదుండేది చిక్కడ్‌పల్లిలో."

"అదేలే మొన్న వెంకటరావు ఒకదేశోల-పెళ్ళికి నేను రాలేదని"

"మొన్న పెళ్ళి చేసుకుంది వెంకటరావుగాదు. ప్రభాకర్రావు వెంకటరావుకి పెళ్ళయి నాలుగేళ్ళయింది."

"అదేలే. మొన్నాదివారం వాళ్ళిద్దరూ కలిసొచ్చారుగా ఇంటికి"

"మొన్నొచ్చింది వాళ్ళు కాదు సుధాకరు వాళ్ళ బావమరిది నరసయ్యగారూను."

"అదేలే, మన కూకట్‌పల్లి స్థలంలో ఇల్లెప్పుడు కడ్తున్నామని అడిగారు"

"కూకట్‌పల్లిలో స్థల మెక్కడిదీ?"

"మన స్థలంవుంది ఫతేనగర్‌లో"

"అదేలే. అల్లుడుగారూ."

"అల్లుడుగారేమిటీ.... నేను సుజాతని...."

సరె.... సరె ... వెధవగొడవ-నను చెప్పి చావక్కీ"



## స్వాతంత్ర్యం

వసంతం వచ్చిందంటూ
గొంతు పగిలేలా కూస్తుంది
ఒక సిర్జీవపు చెట్టు కొమ్మన
నిలిచి కోయిల-
పసివిని వినిగత్తిన నేను
స్వాతంత్ర్యం వచ్చిందంటూ
నరాలు చిట్లేలా అరిచాను
ఎంగిలెరుగని పొట్టబట్టుకొని-

జి. మాధవి

# కసు బాణం

నేను టీవి కొన్నది 1976లో అనుకుంటాను! అప్పట్లో మూడున్నర వెయ్యికంటే తక్కువధరకి టీవి సెట్లు దొరక లేదు!



మల్టీ చానల్, హైఫై సౌండు ఐసీ-సాలిడ్ స్టేటు - ఇంకా ఏవేవో హంగుల్తో ఒక్కో సెట్టును ఐదునుంచి ఏడు వేల రూపాయల దాకా అమ్మారు



ఇప్పుడు రెండున్నర వెయ్యికే టీవి సెట్లు దొరుకుతున్నాయి! నలుపు తెలుపు టీవి ధర బాగా పడిపోయింది! మొదట్లో మామూలు టీవి సెట్టును ఐదారు వేలు పోసి కొన్నప్పుడు కలర్ టీవి ఖరీదు ఏ పన్నెండో పద మూడో వుంటుందనుకునేవాళ్లం



ప్రస్తుతం మన ప్రభుత్వం కలర్ టీవిని ప్రవేశపెడు తోంది! అప్పట్లో లాగే టీవి విడిభాగాలు విదేశా ల్నుండి దిగుమతి చేసు కుంటున్నాం - ఇప్పుడు కూడా!!




ఐనా కలర్ టీవి తయారు
చేసే సంస్థకి సెట్టుకు
వెయ్యి రూపాయల లాభం
వుంటేచాలునని సెట్టు
దిట్టుంచేసి సెట్టు ధర
ఏడున్నరవెయ్యి దాటకూడ
దని నిర్ణయించింది మన
ప్రభుత్వం!!


చూశావా? ప్రభుత్వం
ప్రజలకి ఎంత మంచి
చేసిందో!


ఏడువేల ఐదువందలకే ఓ
కలర్ టీవి కొని యింటికా
రంగు రంగుల బొమ్మలు
చూసుకోవచ్చు!!


ఔనూ! ఇప్పుడు కలర్
టీవి ధర నిర్ణయించినట్లే
అప్పట్లో మామూలు టీవి
ధరని ప్రభుత్వం ఎందుకు
నిర్ణయించలేదు? మధ్య
తరగతి వాళ్ళందరూ తలా
ఓ టీవి ని కొనుక్కుని
వుండే వాళ్ళుగదా!!

# ఓటున్న బాబుల్లారా!

## మినీ కథ

వర్షాకాలం వచ్చినంత నీరసంగానూ మున్సిపల్ ఎలక్షన్లొచ్చాయి.

ధర్మనాయుడుగారికి భీమరాజు, అర్జునరావు అని ఇద్దరు తమ్ముళ్లున్నారు.

వర్షాకాలం రావడానికి మున్సిపల్ ఎలక్షన్లు రావడానికిగల సంబంధం రెండూ చీదరగా వుండడం

మరయితే .

మున్సిపల్ ఎలక్షన్లు రావడానికీ ధర్మనాయుడిగారికి ఇద్దరు తమ్ముళ్లుండడానికీ గల సంబంధం ఏమిటి?

లేకేం... ఉంది.. బోలెడంత వుంది.

ధర్మనాయుడుగారు అధికార పార్టీ తరఫున తన వార్డులో పోటీ చేస్తున్నారు.

తమ పలుకుబడిని ఉపయోగించి తమ్ముడు భీమరాజుకు ప్రతిపక్షం తరఫున అదే వార్డులో సీటిప్పించారు

మూడోవాడు అర్జునరావు ఉమ్మడి పార్టీ తరఫున అదే వార్డులో పోటీ చేస్తున్నాడు

వీళ్ళలో ఎవరు నెగ్గినా పదవి వాళ్ళ కుటుంబంలోనే వుంటుంది.

ఓహ్....ఏం ఆలోచన?

ధర్మనాయుడిగారి తెలివికి జోహార్లు.

వీళ్లు ముగ్గురే గాకుండా ఒకళ్ళిద్దరు సత్రగాయలు కూడా ఆవార్డులో పోటీ పడి మైకుల్లో అరుచుకుంటున్నారు.

ఇంకా అక్కడా అక్కడా భీమరాజు, అర్జునరావు ప్రచారం చేసుకుంటున్నారు గానీ ధర్మనాయుడు గారు మాత్రం కిమ్మనకుండా నిమ్మకునీరెత్తినట్టు కూర్చున్నారు.

ఆయనకి తెలుసు తనని గెలిపించేదేమిటో.

ఈ మైకులు, ఈ కేకలుగాదు తనని గెలిపించేది లక్ష్మీకటాక్షం.

తన దగ్గరున్న లక్ష్మి ఓటరుని కటాక్షిస్తే ఓటరు తనని కటాక్షిస్తాడు.

ఇది ఆయనకి అనుభవం నేర్పిన పాఠం

ఎలక్షను రేపనగా పేటలోవున్న ముగ్గురు నలుగురు లీడర్సుని పిలిపించేరు

## 'సింహం'




వాళ్ళ చేతుల్లో పుష్కలంగా డబ్బు పెట్టేరు ఓటుకి వదిహేను రూపాయలైనా ఫరవాలేదన్నారు. ఇంకా కావలిసొస్తే తననొచ్చి అడగమన్నారు.

ప్రచారమే చెయ్యని ధర్మనాయుడు గారు బంపర్ మెజారిటితో గెలిచారు.

తమ పలుకుబడితో చైర్మన్ కూడా అయ్యారు.

తమ పేటలో మురికివాడల లీడర్లు వచ్చారు తమ వాడలో కుళాయిలు వేయించమని అడగడానికి

వేయించను పొమ్మన్నారు ధర్మానాయుడుగారు.

"ఎందుకు వేయించరు? మేం ఓట్లేస్తేనేగదా మీరు గెలిచింది!" అన్నారు లీడర్లు.

"మీరు నా మీద ప్రేమతో నాకు ఓట్లెయ్యలేదు నా డబ్బు తిన్నారు. నాకు ఓట్లేసేరు. అక్కడితో అది చెల్లు నేను మీకు చెయ్యవలసిన అవసరంలేదు. నా డబ్బు తినని వాళ్ళకే నేను సేవ చేస్తాను." అన్నారు ధర్మనాయుడుగారు

ఇంతకీ శ్రీవారి డబ్బు తినకుండా సేవచేసిన ఉత్తమ మానవులున్నారా అని!

లేకేం... ఉన్నారు.

కంట్రాక్టర్లు!!



గమనిక : "ఒకే రకం" రచయిత శ్రీ ఎం. వి. వి. సత్యనారాయణగారి పేరు 49 వ పేజీలో ముద్రణ జరగనందుకు చింతిస్తున్నాము -సం.

# అహం

ఒక కవి ఒక సభలో ఈవిధంగా వుపన్యసిస్తూ వున్నాడు—

"మీరు కనిపెట్టారో లేదోకానీ, నేను తిక్కన కంటే గొప్పవాణ్ని. నా కవిత్వంలో తిక్కన కవిత్వంలో వున్న గుణాలకంటే గొప్ప గుణాలున్నవి. ఇంతవరకూ భారత దేశంలో పుట్టిన వాళ్ళలో తిక్కన కంటే గొప్పకవిని నేనే...."

ఒక సభికుడు చివాలున లేచి—"తిక్కనకంటే మీరు గొప్ప కవులనుకోవటానికి దృష్టాంతరం ఏమిటి?"

"దృష్టాంతరమా!....దృషాంతరమా," అని నట్లుకొట్టటం మొదలు పెట్టాడు కవి.

ఇంకొక సభికుడు లేచి ఈ విధంగా జవాబు చెప్పాడు "దృషాంతరాలకేం! కావలసినన్ని వున్నాయ్. తిక్కన కవిత్వం రాశాడు: మీరూ కవిత్వం రాశారు. తిక్కనా పుట్టాడు: మీరూ పుట్టారు, వీనిని బట్టి తిక్కనకు వీరికి చాలా పోలికలున్నవని విశదం అవుతూ వుంది. ఇక తిక్కన కంటే ఈయన గొప్పవాడెలా గంటారా! తిక్కన చచ్చాడు, ఈయన చావలేదు"

కవి తెల్లమొహం వేశాడు.

గోపీచంద్

(జరిగిన కథ)

(ఇంటిదార్లో రామ్మోహనరావూ తెలుసుకున్నాడు బ్యాంకుల జాతీయకరణ. ప్లాను మార్చి మళ్ళీ టాటా వాలాకి షేర్లు అమ్మమన్నాడు గాంధీ లక్ష్మిని. అంతే-విమానం వొచ్చి-లక్ష్మిని టాటావాలాని కలిసేలా చేసింది. షేర్ల అమ్మకం అయింది-రామ్మోహనరావుకీ సంతోషమే కలిగింది వార్తతో. కానీ హారికకి లక్ష్మి మీద అనుమానం వచ్చింది. తండ్రికి తెల్సిని విషయం గ్రహించింది. ఇటు అంజిరెడ్డి అనే వా పార మహా మనీషి గాంధికి దగ్గరయాడు-కొన్ని రహస్యాలతోటి. రాజకీయంలోనూ, కర్మాగారంలోనూ, పునఃసృష్టి మొదలయ్యే సూచన-రామ్మోహనరావుకీ, గాంధీకీ మధ్య చిత్రమైన రహస్య కోణంలో అంజిరెడ్డి సాయం...)

—ఇక చదవండి—

# 24

లక్ష్మిలో ఏదో మార్పు వచ్చిందని తెలుస్తూనేవుంది. అయితే అది ఎందువల్లో కారణం తెలియలేదు గాంధీకి.

రాష్ట్రంలో పరిస్థితులు నెమ్మదిగా విషమిస్తున్నాయి. ఇంకా తొందరగా అవి ఉద్రిక్తస్థితిని చేరుకొనేవేగానీ, మధ్యలో ఒక పదిహేనురోజులపాటు రామ్మోహనరావు ఆరోగ్యపరీక్ష చేయించుకోవటానికి స్విట్జర్లాండు వెళ్ళి రావటంవల్ల కొద్దిగా మందకొడిగాసాగినాయ్. లక్ష్మి ఇప్పుడు గాంధీతోపాటూ వుండటంలేదు. అడవిలో ఫ్యాక్టరీలో వుంటూంది. దీనికి కారణం తెలుసుకోవాలంటే కొన్నాళ్ళు వెనక్కి-వెళ్ళాలి...

....శివకైలాష్ బ్యాంక్ మూతపడటంతో లక్ష్మి డైరెక్టర్‌షిప్ పోయి, ఖాళీగా వుంది. "నాకేం తోచటంలేదు. ఏం చెయ్యను?" అని అడిగింది గాంధీని.

"మన పేపర్ మిల్లులో పనిచెయ్యి."

"నాకు అకౌంట్సుగానీ, ఇంజనీరింగుగానీ రావే."

"అకౌంట్సూ-ఇంజనీరింగా-అవన్నీ ఎందుకు? జనరల్ మానేజర్‌గాచెయ్యి."

"నేను జనరల్‌మానేజరా"అని అరిచినంత పనిచేసింది లక్ష్మి. గాంధీనవ్వేడు. "ఏ పనీ రాని బంధువుల్ని అందుకే పెద్దపెద్ద పొజిషన్లలో వేసుకుంటారు. ఎగ్జిక్యూటివ్ అంటే ఏపనీ రానివాడన్నమాట. కేవలంనిర్ణయాలుతీసుకొని, దాన్ని అమలుజరపటాన్ని క్రిందివాళ్ళ మీదకీ, అవి తప్పుడు నిర్ణయాలైతే పైవాళ్ళమీదకీ తోసెయ్యగల వాడే ఎగ్జిక్యూటివ్."

లక్ష్మి మొహం ఉక్రోషంతో ఎర్రబడింది. "నేనలాటి పన్లేమీ చెయ్యను. నువ్వే చూస్తావుగా" అంది.




ఆమె మాటలు నిజమే అయ్యాయి. ఉద్యోగం ఆర్డరు పట్టుకొని ఆమెఅడవిలో ఫ్యాక్టరీకి వెళ్ళిపోయింది. గాంధీ ఇప్పుడు పట్నంలో రాజకీయాలనే అడవిలో నాయకులనే మృగాలతో కొత్త పరిచయాలు ఏర్పర్చుకుంటున్నాడు.

ఫ్యాక్టరీ చేరుకోగానే లక్ష్మిపనిలోపడింది. ఆమె దృష్టిఅంతా 'ఉత్పత్తి' మీదే వుంది. లక్ష్మి రాకతో విద్యార్థిపని సగం తెరిపిన పడ్డట్టయింది. టెక్నికల్ సైడు మరింత దృష్టి సారించగలిగాడు. జీతం తీసుకుంటూ పనిచేసే ఒక ఉద్యోగినిలా లక్ష్మి ప్రవర్తించసాగింది. రాగానే ముందు ఆమె చేసిన పని ఏమిటంటే యూనియన్ లీడర్స్‌తో మీటింగు ఏర్పర్చి కార్మికుల ఇళ్ళు, వైద్య సదుపాయం మొదలైన వాటి గురించి చర్చలు జరపటం. అడవిలో మలేరియా దావానలంలా వ్యాపిస్తూంది. బయట్నుంచి వచ్చిన ఉద్యోగస్తులూ, కార్మికులూ ఆ అడవిలో పగలు ఎండలకీ, రాత్రిపూట చలికీ తట్టుకోలేకపోతున్నారు.

లక్ష్మి రాకతో ఆ ఆవరణకే ఒక కొత్తశోభ వచ్చినట్టు అయింది. ఆ ఇరవై రెండేళ్ళ అమ్మాయి అలా ఉత్సాహంగా తిరుగుతూ పనులు నిర్వర్తిస్తూవుంటే చూడ ముచ్చటగా వుండేది. టేబిల్‌లైట్ కాంతిలో రాత్రి ఒంటిగంట వరకూ కాగితాలు ముందు వేసుకొని ఏకాగ్రతతో ఆమె పని చేసేది.

మొదట్లో చులకనగా చూసినవాళ్ళు, పెద్దల ప్రాపకంతో ఎవరో అమ్మాయి

జనరల్ మానేజర్‌గా వస్తుందని తెలిసి 'తోక' ఆడిద్దామనుకున్నవారూ చాలా తొందర్లో తమ అభిప్రాయం మార్చుకోవలసి వచ్చింది.

ప్రొడక్షన్ పెరగసాగింది. ఇలాగే కొనసాగితే, మొదటి సంవత్సరమే 'బోనస్' కూడా హెచ్చుగా వుంటుందన్న నమ్మకం కార్మికులకి కలిగింది. లక్ష్మికి రోజుకి ఇరవై నాలుగు గంటలు సరిపోవటంలేదు. కానీ గమనించి చూస్తే ఆమె కల్పించుకొన్న ఆ పనుల వెనక అస్పష్టమైన బాధని కప్పిపుచ్చుకోవాలన్న తపన కనపడుతుంది. ఈ ప్రపంచంలో బాగా కష్టపడే ప్రతివ్యక్తి వెనుకా ఒక బాధాతప్తమైన నీహారిక వుంటుంది.

ఆమె ఫ్యాక్టరీలో చేరిన కొన్ని రోజులకి ఒకనాడు హనుమంతరావువచ్చాడు. అన్నని చూసి ఆమె సతోషించింది. మనసులో ఏ మారుమూల పొరల్లోనో స్త్రీకి క్షమాగుణాన్ని అమరుస్తాడు కాబోలు దేముడు. అందులోనూ ఆమె ఆ చిట్టడివిలో మరీ ఒంటరితనం ఫీలవుతూంది. హనుమంతరావు రామ్మోహనరావు తాలూకు మనిషి అని తెలుసు. ప్రతీదీ ఆయనకి చేరవేస్తున్నాడని తెలుసు. అయినా ఆ క్షణం అతడిని చెల్లెలుగా ఆహ్వానించింది. ఎవరిమీదో తలయని కసిని అతడిమీద అభిమానంగా చూపెట్టింది. అక్కడే ఆమె తప్పటడుగు వేసింది.

రాత్రి పదింటికి తన ఆఫీసురూమ్‌లోకి ప్రవేశించిన అన్నయ్యని చూసి, అలసట నిండిన కళ్ళలో చిరునవ్వు నింపుకొని ఆహ్వానించింది.

"ఎందుకమ్మా మరీ ఇంత కష్టపడటం" అని అడిగాడు హనుమంతరావు వచ్చి ఎదుటి సీట్లో కూర్చుంటూ.

"వాళ్ళు మనకి జీతం ఇస్తున్నప్పుడు దానికి సరిపడా పని చెయ్యాలికదా" అంది లక్ష్మి.

"ఇంత చిన్నవయసులో నువ్వు ఇంత పెద్ద బాధ్యత నిర్వహిస్తున్నావంటే నాకెంతో ఆనందంగా వుంది."

లక్ష్మి మాట్లాడలేదు, అతడేదో తిరిగి అనబోతూవుంటే టాపిక్ మారుస్తూ ఆమె అంది. "నువ్వూ వదిన్ని తీసుకొని ఇక్కడికి వచ్చెయ్యకూడదా అన్నయ్యా. ఏదో ఒక ఉద్యోగం ఇక్కడే చూడొచ్చు!" ఆనె మాటల్లో-నువ్వు రామ్మోహనరావు దగ్గర పని చేస్తున్న విషయం మాకు తెలుసు-అవి లీలగా స్ఫురించింది. అతను దాన్ని గుర్తించినట్టే "వద్దులే అమ్మా గాంధీ దగ్గర పనిచెయ్యటం నాకు ఇష్టంలేదు" అన్నాడు మొహం తిప్పకుని.

"ఏం! తనకేమయింది?"

"సర్లే-ఆ సంగతి వదిలిపెట్టు. ఇంకేమైనా విశేషాలు చెప్పు."

"ఏముంటాయి విశేషాలు?"

"ఈ ఫాక్టరీ ప్రారంభించి ఎంత కాలం అయింది?"




---

"ఆరేడు నెలలవ్వొస్తుంది."

"నువ్వు చేరి ఎన్ని నెలలు అయిందన్నావ్?"

లక్ష్మి నవ్వింది. "నేనేమీ అనలేదే" అని ఆగి "...రెండో నెల అనుకుంటా" అంది.

"ఎంతొస్తుంది జీతం?"

ఆమెకి చెప్పటం ఇష్టం లేక "అలాంటి లెక్క ఏమీ రేదు." అని అబద్ధం చెప్పింది.

"నీకు చెప్పేటంతటి వాడిని కాదనుకో. అయినా ఎప్పుడు ఎలా మారతారో మనుషులు. ఒక అప్పాయింట్‌మెంట్ ఆర్డర్ తీసుకోకూడదూ గాంధీ దగ్గర?"

"అలాటి అవసరమేమీ పడదు-గాంధీ మీద నాకు నమ్మకం వుంది."

"సరే నీ ఇష్టం" అంటూ అతడు లేచాడు. ఇంతలో రెండో షిఫ్టు మానేజరు వచ్చి ఏదో చెప్పాడు. లక్ష్మి అతడితోపాటూ హడావుడిగా ఫ్యాక్టరీవైపు బయల్దేరింది.

వాళ్ళిద్దరూ దూరంగా వున్న ఫ్యాక్టరీ బిల్డింగు చేరుకునేవరకూ హనుమంతరావు కదలకుండా అలానే కిటికీ దగ్గిర నిలబడి చూసేడు. వాళ్ళు చాలా దూరం వెళ్ళారని నిశ్చయించుకోగానే చువ్వలా వెనుదిరిగాడు.

ఆమె టేబిలూ, గోడకున్న అల్మెరా వెతకసాగేడు. రామ్మోహనరావు అత

డిని దేనికోసం వెతకమని చెప్పాడో అది దొరికే సరికి పదినిముషాలు పట్టింది.

ఒక చిన్న నోట్‌బుక్ అది.

లక్ష్మి చేతివ్రాతతో వ్రాసుకున్నది.

ఎక్సైజ్ డ్యూటీ వారి కోసం, ఇన్‌కంటాక్స్ వారి కోసం వ్రాయబడ్డ పుస్తకాలు ఫ్యాక్టరీ అకౌంట్స్ డిపార్టుమెంటులో ఉంటాయి. అసలు జరుగుతున్నది ఏమిటో యజమానులకీ, జనరల్ మానేజర్లకీ తెలుస్తుంది. ఇది సర్వత్రా వున్నదే.

హనుమంతరావు తనతోపాటూ తీసుకెళ్ళింది అలాటి "అసలు" ప్రొడక్షన్ అంకెలున్న పుస్తకం.

లక్ష్మికీ విషయం మరుసటి రోజు మధ్యాహ్నంగానీ తెలియలేదు. ప్రొద్దున్నే బస్‌స్టాండ్‌కి వెళ్తూంటే "రేపు వెళ్ళాగాన్లె అన్నయ్యా-రేపైతే కారు వెళ్తుంది. అందులో పంపుతాను" అంది మామూలుగా.

"నాకి కార్లూ అవీ ఎందుకు" అని హనుమంతరావు బస్‌లో వెళ్ళిపోయాడు.

ఆ మధ్యాహ్నం ప్రొడక్షన్ మానేజర్ వచ్చి క్రితం రోజు తాలూకు అంకెల షీటు ఇచ్చి వెళ్ళిపోయాక, వాటిని నోట్ చేసుకుందామంటే పుస్తకం కనబడలేదు.

కంగారుతో ఆమె ఒళ్ళంతా చెమటపట్టింది. పుస్తకాలనన్నిటినీ చెల్లా చెదురు చేస్తూ గబగబా వెతికింది. అది చాలా ముఖ్యమైన పుస్తకమనీ, ఎవరిచేతిలోపడినా ప్రమాదమనీ ఆమెకు తెలుసు. ఎక్కడో బాత్‌రూమ్‌లోనో, వంటింటి అటకమీదో దాచవలసిన పుస్తకం అది. కొంచెం నిర్లక్ష్యంగా ఆఫీసులోనే పెట్టేసింది. ఇప్పుడీ విషయం గాంధీకి తెలుస్తే ఎలా?

ఆమె విద్యార్థిని అర్జెంటుగా రమ్మనీ కబురు పంపింది. జరిగిందంతావిని అతడూ కంగారుపడ్డాడు. అతడికి ఇలాటి విషయాలు పెద్దగా తెలీదు. మిషన్‌లాగా పని చెయ్యమంటే చేస్తాడంతే.

"ఎలా పోయివుంటుంది-నిన్నగానీ ఎవరైనా మీరు లేనప్పుడు వచ్చారా" అని అడిగాడు. అప్పుడు జ్ఞాపకం వచ్చింది ఆమెకి హనుమంతరావు సంగతి. ఆ విషయం గుర్తురాగానే అంతాఅర్థమైపోయింది. పాము అని తెలిసీ అతడిని చేరదీసిన తనని గాంధీ క్షమించాడు. అయినా ఇక్కడ అతడు క్షమిస్తాడా లేదా అని ఆలోచిస్తూ కూర్చుంటే కొంపలంటుకుంటాయి.

ఆమె ఫోన్ దగ్గిరకు లాక్కొని గాంధీతో మాట్లాడటం ప్రారంభించింది.

• • • •

"ఇంకో పది రోజుల్లో విద్యార్థినాయకులు స్ట్రైకు ప్రకటిస్తున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా ఒకే రోజున ఇది ప్రారంభం అవుతుంది. స్ట్రైకు ప్రారంభం అయిన పది రోజులకి దాని ఉధృతం చూసుకుని, అఫీషియల్‌గా రామ్మోహనరావు పేపరు

ధర తగ్గిస్తున్నట్టు ప్రకటిస్తాడు. గెలుపు అతడిది కాకముందే మనం మన మిల్లుల్ని ముందు అనుకున్నట్టు మూసెయ్యాలి. అతడి ధరకి ఎలాగూ ఉత్పత్తి చెయ్యలేం కాబటి, చేతులు కాలకముందే ఈ పని చెయ్యాలి" అన్నాడు అంజిరెడ్డి. గాంధీ ఆఫీసులో కూర్చుని వున్నారు ఇద్దరూ.

పుస్తకాలు కావాలని పిల్లలు చేసే స్ట్రైకువల్ల-కాగితం ఉత్పత్తి మరింత పడిపోయి, పుస్తకాలధర పెరిగి, మరింత ఆలస్యం అవుతుంది. ఈ విషయం రాజకీయ నాయకులకి, మేధావి వర్గానికీ, స్ట్రైకు చేయిస్తున్నవారికీ తెలుసు. పోతే చేసేవాళ్ళకే తెలీదు! గాంధీకి ఈ విషయం తెలుసుకొంటే నవ్వూ బాధా రెండూ కలుగుతున్నాయి. అయినా ఇప్పుడు చెయ్యగలిగింది ఏమీలేదు.

అంజిరెడ్డి తిరిగి ఏదో చెప్పబోతూ వుంటే ఫోన్ మ్రోగింది. గాంధీ మామూలుగా ఎత్తుకొని మాట్లాడటం ప్రారంభించినా, అరనిముషం గడిచేసరికి అతడి మొహంలో మార్పు కొట్టొచ్చినట్టు కనబడింది. "మైగాడ్. ఎప్పుడు ఇదిజరిగింది?" అన్నాడు. అంజిరెడ్డి ఈ మాటలు అర్థంకాక కుతూహలంగా చూడసాగాడు. గాంధీ అట్నుంచి చెప్తుందంతా విని "ఎప్పుడు బయలుదేరారు హనుమంతరావు?" అని అడిగాడు. వచ్చిన జవాబు విన్నాక ఫోన్ పెట్టేశాడు. అతడి మొహం తెల్లగాపాలిపోయింది. మాటిమాటికీ పెదవి కొరుక్కోసాగాడు.

"ఏం జరిగింది" అని అంజిరెడ్డి అడిగాడు.

గాంధీ తనకి వచ్చిన కబురు చెప్పాడు. విషయం అంతావిని, అంజిరెడ్డి కూడా ఒక క్షణం రామ్మోహనరావు ఎత్తుకి ఆశ్చర్యపోయాడు. కానీ అది ఒక క్షణం మాత్రమే. వెంటనే తేరుకొని "హనుమంతరావు ఆ పుస్తకాన్ని రామ్మోహనరావ్‌కి అందజేసేడటనా" అని అడిగాడు.

"ఈపాటికి ఈ వూళ్ళో దిగివుంటాడు. డైరక్టుగా రామ్మోహనరావు దగ్గిరికి వెళ్తాడో లేకపోతే ఇంటికి వెళ్ళి అక్కణ్నుంచి వెళ్తాడో" అన్నాడు గాంధి. అతడి మొహంలో ఆందోళన కొట్టొచ్చినట్టు కనపడ్తూంది.

అంజిరెడ్డి ఒక నిర్ణయానికి వచ్చినట్టూ "సరె-ఆవిషయం నాకు వదిలిపెట్టు. పుస్తకం సంపాదించిపెట్టే బాధ్యత నాది" అన్నాడు.

గాంధీ ఆశ్చర్యంగా "ఎలా" అని అడిగాడు. అంజిరెడ్డి నవ్వి, కుర్చీలోంచి లేచి గాంధీ కూర్చున్నదగ్గిరికి వస్తూ "బిజినెస్ అంటే కేవలం డబ్బు లావాదేవీలు చూసుకోవటంకాదు. మనచుట్టూ బలగాన్నికూడా పెంపొందించుకోవాలి. మనం ఏం చెయ్యమంటే దాన్ని-ఎదురుప్రశ్నలు వెయ్యకుండా చేసే మనుష్యుల్ని సమకూర్చుకోవాలి."

"ఆ పుస్తకం సంపాదించటంతో సమస్య తీరిపోదు. వస్తూ వస్తూ బస్‌లో హనుమంతరావు ఆ పుస్తకం చదివేవుంటాడు. ఆ పుస్తకం తిరిగి మనని చేరు




కున్నా, రామ్మోహనరావు ఈ విషయాలన్నీ తెలుసుకుంటే ప్రమాదం. హనుమంత రావు తెలివితక్కువవాడేమీకాదు.

—అవును. హనుమంతరావు తెలివితక్కువవాడేమీ కాదు. అతడు బస్ దిగి సరాసరి ఇంటికి వచ్చేసేడు. వస్తూనే జేబులోంచి పాకెట్ టేప్‌రికార్డర్ తీసేడు.

ఇలాంటి టేప్ వుపయోగిస్తాడని లక్ష్మిగానీ గాంధీగానీ వూహించలేదు. ఈ టేప్ ఇచ్చింది రామ్మోహనరావు.

గదితలుపులు వేసుకొని, ఆ టేపుపక్కనే ఇంకొక టేప్ పెట్టుకొని దాదాపు పావుగంటసేపు ఒకదానిలోనుంచి మరొకదానిలోకి ఎక్కిస్తూ-మధ్యలో తనూ మాట్లాడాడు.

దాదాపు ఇది పూర్తవుతూవుంటే బైట తలుపుచప్పుడు వినిపించింది. వెళ్ళి తలుపు తీశాడు. ఎవరో తెలియని ఆగంతకులు ఇద్దరు బైట నిలబడివున్నారు.

"హనుమంతరావుగారు మీరేనా?"

"అవును."

"మిమ్మల్ని తీసుకుని ఒకసారి రమ్మన్నాడు టాటావాలా"

అతడికి టాటావాలా కొద్దిగా తెలుసు. "ఇప్పుడేవస్తాను" అని లోపలకి వెళ్ళి బట్టలు మార్చుకొని వచ్చి కార్లో కూర్చున్నాడు.

ఆతరువాత అతడేమయ్యాడో ఎవరికీ తెలీదు. మన మధ్య తిరిగే మనుష్యులు సడెన్‌గా డిస్సెపియర్ అయిపోవటం ఈ సమాజంలో కొత్తకాదు.

ప్రియంవదమాత్రం చాలా కాలంవరకూ బొట్టు పెట్టుకుంటూనే వుంది.

ం ం ం ం ం

రామ్మోహనరావుపైకి అలా మామూలుగా కనబడ్తాడుకానీ చాలా లోతైన వాడు. బిజినెస్ ప్రారంభించిన కొత్తలో వుంటుంది ఆవేశం. తరువాత రాటుదేలటం ప్రారంభం అవుతుంది. మొహంమీద-చిరునవ్వు ఎప్పుడూ అతుక్కునేవుంటుంది. ప్రధానమంత్రితోనూ ఇన్‌కంటాక్స్ గుమస్తాతోనూ ఒకే మర్యాదతో మాట్లాడగలగటం అలవాటు అవుతుంది. మనసులోతు ఎవరికీ తెలీదు.

చివరికి కూతురికి కూడా.

కూతుర్ని అడవిలో ఫ్యాక్టరీకి తీసుకెళ్ళటంలో రామ్మోహనరావు ఉద్దేశ్యం బ్రహ్మదేవుడు కూడా పసిగట్టలేడు. ఒకసారి గాంధీ ప్రసక్తి వచ్చినప్పుడు ఆ అమ్మాయి కళ్ళలో తళుక్కున మెరిసిన మెరుపు ఆయన సునిశితమైన దృష్టిని దాటిపోలేదు. తనకొచ్చిన అనుమానాన్ని బలపర్చుకోవటం కోసం ప్రారంభోత్సవానికి తీసుకెళ్ళాడు. అక్కడికి లక్ష్మి వస్తుందని ఆయనకు ఎందుకో అనిపించింది. కానీ ఆయన అనుకున్నట్టు కాక గాంధీ కనిపించటం, ఉపన్యాసంలో మాట్లాడటం-ఒక గొప్పషాకు. గాంధీ మాట్లాడుతున్నంతసేపూ ఆయన తన కూతుర్నే గమనిస్తున్నాడు గెడ్డం క్రింద చెయ్యిపెట్టుకొని తదేకంగా వింటున్న హారికని చూస్తే ఆయన కేదో అర్థమైంది.

ఇలాటివి లక్ష చూసేడాయన.

ఆయన ట్రాప్‌లో హారిక చాలా సులభంగా పడిపోయింది. రాత్రి పదకొండింటికి ఆయన నిద్రపోతూ వున్నాడనుకొని-పక్క కాటేజీకి ఫోన్ చేసి, గాంధీతో, "నేనూ-హారికని! గంటసేపట్నుంచీ మీ కోసం ప్రయత్నం చేస్తున్నాను" అని ఆ అమ్మాయి చెప్తున్నప్పుడు రామ్మోహనరావు పక్కగదిలో నుంచి అంతా విన్నాడు ఆయన మొహం ఎర్రగా నిప్పులా మారిపోయింది. అయితే అది ఒక క్షణం మాత్రమే. తరువాత మామూలుగానే నిద్రపోయాడు. టెన్షన్సు టెన్షన్సే నిద్ర నిద్రే.

ఆయన పూరురాగానే చేసిన మొదటిపని టెలిఫోన్ బిల్లులు తెప్పించి చూడటం.

తన ఇంటి నుంచి వరంగల్ అవతల నున్న అడవిలో పేపరు మిల్లుకి ఏవైనా ఫోన్లు (టంక్‌కాల్స్) వెళ్ళాయా అని చూసాడు. హారిక కొన్ని రోజుల క్రితం సాయంత్రం గాంధీకి ఫోన్ చేసి లక్ష్మిని హనుమంతరావు గుర్తుపట్టాడని చెప్పిన ఫోన్ కాల్ దొరికింది. అంటే తను అనుకున్న దానికన్నా వీరిద్దరి పరిచ



"కర్కశంగా, గరుకుగాఉండే
పళ్ళపొడులు మీ పళ్ళకు,
చిగుళ్ళకు
హానికలిగించవచ్చు..."

# కాల్గేట్ టూత్ పౌడర్‌తో మీ చిగుళ్ళను, చెడుశ్వాసను కూడా అరికట్టండి పళ్ళను కాపాడుకోండి.







కోల్గేట్ టూత్ పౌడర్ ఎంతో మెత్తగా ఉండే తెల్లని పౌడర్. అది అతి మృదువుగా మీ చిగుళ్ళను తోముతుంది. అంతేగాకుండా దానిలో ఉండే సున్నితమైన మెరుగునిచ్చే పదార్థం మీ పళ్ళ మీది పాచిపొరలను తొలగిస్తుంది. మీ పళ్ళను శుభ్రపరచి తెల్లగా చేస్తుంది. కోల్గేట్‌లోని పుష్కలమైన నురుగునిచ్చే చర్య పళ్ళ సందులలోనికి చొచ్చుకుపోయి చెడు వాసనను దంతక్షయకారకములైన సూక్ష్మ క్రిములను తొలగిస్తుంది.

మీ కుటుంబానికి కోల్గేట్ టూత్ పౌడర్‌తో అధునాతనమైన [illegible] దంతరక్షణ సమకూర్చండి. దానియొక్క చల్లని, పిప్పర్‌మెంట్ రుచిని వారంతా మెచ్చుకుంటారు.

యమూ పెరిగిందన్నమాట. గాంధీ నెగ్గటానికి **ఇన్ డైరెక్టుగా తన కూతురే** సాయపడ్తుందన్నమాట.

తనే చాలా తెలివిగా గాంధీ ఇంట్లో గాంధీమనిషినే గూఢాచారిగా నియమిస్తే, గాంధీ అంతకన్నా తెలివిగా తన కూతుర్నే తన ఇంట్లో ప్లాంట్ చేసేడన్న మాట.

ఆయన ఆవేశంతో వూగిపోయాడు. ఇప్పుడు సమస్య గాంధీ గెలుపుకాదు. గాంధీతోపాటే జోలెపట్టుకుని తన కూతురు ప్రేమపేరిట ఇంట్లోంచి బయటపడకుండా దీన్ని మొదట్లోనే చెయ్యాలి.

బ్రహ్మాండమైన ప్లాన్ వేసి ఆయన హనుమంతరావ్‌ని లక్ష్మిదగ్గిరికిపంపేడు. పుస్తకం కేవలం మిషమాత్రమే. లక్ష్మితో ఎలా మాట్లాడాలో రామ్మోహనరావే అతడికి చెప్పాడు. టేప్‌కూడా ఇచ్చాడు.

అతడు వచ్చాడని తెలిసి, రామ్మోహనరావే స్వయంగా అతడి ఇంటికి వెళ్ళాడు.

ప్రియంవద తలుపు చాటునుంచి "ఇప్పుడే ఎవరో వచ్చి కార్లో తీసుకెళ్ళారండీ" అంది నమ్రతగా, ఒకవైపు స్థనంకనపడేలా నిల్చుని. ఆయన దానికంత ప్రాముఖ్యత ఇవ్వలేదు. హనుమంతరావ్ తన మనిషి అని గాంధీకి తెలిసిపోయిన తర్వాత ఇక అతడితో అవసరంలేదు ఆయనకి. చదరంగంలో రాజులు పోరాడుకోవటానికి ముందు బంట్లని చంపుకొంటారు.

బల్లమీద వున్న టేపుని కోటుజేబులో పెట్టుకుని ఆయన వెనుదిరిగాడు.

o o o o o

"ఇదిగో ఇదేనా మీ పుస్తకం" బల్లమీదకు విసిరేస్తూ అన్నాడు అంజిరెడ్డి. గాంధీ మొహం విప్పారింది. "ఇదే" అన్నాడు దాన్ని అందుకుంటూ.

"దీన్నింకా అతడు తన యజమానికి అందివ్వలేదు."

"ఎలా దొరికింది ఇదీ."

"అతడి దగ్గిరే"

"కానీ అతడీ పుస్తకాన్ని చదివి వుంటాడు."

"చదివినా అతడింకేమీ మాట్లాడలేడు."

"అంటే"

"జీవితంమీద విరక్తి చెంది అతడు సన్యాసుల్లో కలిసిపోయాడట."

గాంధీ నమ్మశక్యం కాని విషయం వింటున్నట్టు కుర్చీలోంచి ఒక్క ఉదుటున లేచి "నిజమా" అని అడిగాడు.

"ఏమో మరి. కొందరలా అంటున్నారు. కొందరేమో రామ్మోహనరావు తాలూకు డబ్బు అయిదారు లక్షలు పట్టుకొని పరారయ్యాడని అంటున్నారు. ఏది నిజమో ఎవరికీ తెలీదు. తెలిసిన నిజం మాత్రం హనుమంతరావు కనబడటంలేదని" అంటూ, గాంధీ తనవైపు సూటిగా చూసేసరికి [illegible] నవ్వు నవ్వేడు.




గాంధీ చేతులు కంపించసాగాయి. పెదవులు వణికాయి. "హనుమంతరావు అతడు...అతను చచ్చిపోయేడా" అన్నాడు.

"కొన్ని విషయాలు మనం పైకి మాట్లాడుకోకపోవటం మంచిది. ఎవరికి వాళ్ళు అర్థం చేసుకోవాలి"

గాంధీ దిక్కులు పిక్కటిల్లేలా "నో" అని అరిచాడు. అతడి కంఠం ఆ గది గోడలమధ్య ప్రతిధ్వనించింది. అతడి కళ్ళలో నీళ్ళు తిరిగేయి. "మన అవసరాలకోసం ఒక మనిషిని బలి చేసుకోవటం అన్యాయం." అన్నాడు రుద్ధమైన కంఠంతో.

రంజిరెడ్డి కదల్లేదు. కనీసం ఓదార్చలేదు. తాపీగా సిగార్ తీసుకొని వెలిగించాడు. "నువ్వు అవసరమైన దానికన్నా ఎక్కువ అమాయకత్వం నటిస్తున్నావని నా వుద్దేశ్యం" అన్నాడు. విస్తుపోవటం గాంధీ వంతయింది.

"నిజం చెప్పు. హనుమంతరావు నోరు శాశ్వతంగా మూయబడుతుందని నీకు తెలీదూ? అది మూయకపోతే అతడినుంచి రహస్యాన్ని దాచటంఎలా? ఇవన్నీ మనం చర్చించుకోలేదు- నిజమే. కానీ నేను "ఆ విషయం నాకు వదిలిపెట్టు. ఆ పుస్తకం సంపాదించిపెట్టే బాధ్యత నీది అని నేను అన్నప్పుడు నువ్వు మౌనంగా వుండి పోయ్యావు. అంటే నేను చెయ్యబోయే పనికి నువ్వు అంగీకరించావన్నమాట. కొద్దిగా

ఆలోచిస్తే నేను చెయ్యబోయేది నీకు తెలిసివుండేది. కానీ ఆలోచించటానికి నీ మనసు ఒప్పుకోలేదు. "నాకేమీ తెలియదు" అన్న ఆత్మవంచనతో నీ తప్పుని నువ్వు కప్పిపుచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నావు...ఇప్పుడు నేను నిన్ను తప్పు వొప్పు కొమ్మనిఏమీ అనటంలేదు. జరిగిందంతా మనకి తెలుసు-కానీ తెలియనట్టు వూరు కుందాం బిజినెస్‌లో పెద్ద మనుష్యులు చేసేది అదే!"

"బిజినెస్...బిజినెస్...బిజినెస్-టి హెల్ విల్ దిస్"

"దీన్ని స్మశాన వైరాగ్యం అంటారు. ప్రతివాడికీ అప్పుడప్పుడు కలుగు తుంది."

నీళ్ళు నిండిన కళ్ళు పైకెత్తి గాంధీ అతడిని నిస్సహాయంగా చూసేడు. హనుమంతరావ్ మరణాన్ని అతడింకా జీర్ణించుకోలేదు.

"మీరు...మీరు నన్ను ఎందుకు అర్థం చేసుకోరు? నేను చట్టానికి లోబడి ఉంటాననీ చట్ట విరుద్ధంగా ఏపనీ చేయననీ ప్రమాణం చేసాను. అలాటిది అన్నిటి కన్నా పెద్ద నేరమైన "హత్యకి" కారణభూతుడిని చేశారు."

అంజిరెడ్డి నవ్వేడు "నువ్వు హత్య చెయ్యలేదు-చట్టం నిన్ను ఏమీ చెయ్య లేదు" అన్నాడు.

"మీరన్నట్టు అది ఆత్మవంచన. నిజంగా నేను కొద్దిగా ఆలోచించివుంటే ఇది తెలిసి వుండేదినాకు"

"తెలిసి ఏం చేసివుండేవాడివి. ఆ పుస్తకం రామ్మోహనరావుకి అందచేయ బడే వరకూ వూరుకొనేవాడివా?"

గాంధీ మాట్లాడలేదు.

"ఈ సమాజంలో చట్టవిరుద్ధంగా డబ్బు సంపాదించటం అన్న ప్రశ్నే లేదు గాంధీ. నువ్వు ఎంత అమాయకత్వంతో పందెంకట్టావో నాకు అర్థం కావటం లేదు. నీ పందెన్ని "చట్టానికి దొరక్కుండా" అని మార్చుకో. చట్టవిరుద్ధం అన్నది వ్యాపార లక్షణాల్లో ఒకటి. అది నువ్వు చేస్తూనే ఉన్నావు."

"ఎలా"

"ప్రభుత్వాధికారులకి అందమైన రెండురకాల అకౌంటు పుస్తకాలు తయా రుచేయటం చట్ట విరుద్ధంకాదా!"

"అవి కంపెనీవి కంపెనీ ఉద్దేశ ప్రకారం "A COMPANY IS AN ARTIFICIAL PERSON"

"ఇది రెండో ఆత్మవంచన. కంపెనీవేరూ నువ్వువేరూ అయినప్పుడు ఎం దుకు ఆ చిన్న నోట్ పుస్తకంకోసం అంత కంగారుపడ్డావు? ఆ పుస్తకం బయట పడితే డైరెక్టరు విద్యార్థిని అరెస్టుచేస్తారు. జనరల్ మానేజరు లక్ష్మిని జైల్లో పెడ్తారు. అలా జరుగుతూవుంటే చూస్తూ వూరుకోవటం న్యాయవిరుద్ధంకాదా. డబ్బు సంపాదనా, తప్పుచెయ్యటం అనే రెండూ ఎప్పుడూ మిళితమయ్యేవుంటాయి. నిన్ను

చేసుకొన్న విద్యార్థిని నిన్ను ప్రేమించిన లక్ష్మినీ రక్షించటం కోసం, ఆమాత్రం చేయ్యక తప్పదు."

గాంధీ [illegible]న తలెత్తి "ప్రేమించిన లక్ష్మా? ఏం మాట్లాడుతున్నారు మీరు" అని అడిగాడు [illegible]ంగా.

"ఈ విషయం నీకు తెలీదనుకోవటం....ఇది మూడో ఆత్మ వంచన!"

○ ○ ○ ○ ○

ఎయిర్‌కండిషనర్ చప్పుడు తప్ప ఆగది నిశబ్దంగా వుంది, గది తలుపు లోపలవైపు గడియవేసుకొని, తను తీసుకొచ్చిన టేపుని రికార్డర్‌లో పెట్టి స్విచ్ వేసాడు రామ్మోహనరావు. లక్ష్మి హనుమంతరావులమధ్య సంభాషణ ఇలా వినిపించింది.

"నువ్వో పదిన్నీ తీసుకుని ఇక్కడికి వచ్చెయ కూడదా అన్నయ్యా. ఏదో ఒక వుద్యోగం ఇక్కడే చూడొచ్చు."

"మీ ఆయనదగ్గరా? వద్దులే అమ్మా"

"ఏం? తనకేమయింది?"

"సర్లే దానికేం గానీ-ఏమంటున్నాడు గాంధీ!

ఏమైనా విశేషం వుందా?"

లక్ష్మి గొంతు- "ఏముంటాయి విశేషాలు."

"ఎంతకాలమయింది మీ పెళ్ళయి?"

"ఆరేడు నెలలవ్వొస్తుంది."

"మరి ఏ విశేషమూ లేదంటావేం?"

లక్ష్మి నవ్వు "నేనేమీ అన్లేదే!"

"ఎన్నో నెల?"

"అలాంటి లెఖ్ఖ ఏమీలేదు."

"నీకు చెప్పేటంతటివాడిని కాదనుకో. అయినా ఎప్పుడు ఎలా మారతారో మనుష్యులు. మెళ్ళో సూత్రం లేకపోతే పోన్లే. కనీసం రిజిస్టార్ ఆఫీసులోనన్నా సంతకాలు పెట్టుకోండి."

"అలాటి అవసరమేమీపడదు. గాంధీమీద నాకు నమ్మకం వుంది."

"సరే నీ ఇష్టం."

టేప్ అయిపోయింది. రామ్మోహనరావు దాన్ని ఆపుచేసి, కాసేట్ తీసి కోటు చేబులో పెట్టుకున్నాడు. అతడి మొహం సంతృప్తితో వెలుగుతుంటి.

(ఇంకా వుంది)

# జ్యోతి భాగ్యలక్ష్మి కథల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ




తెలంగాణాలో దొరలు ఎలా వుంటారని ప్రజల్ని అడిగితే...

...ఆరడుగుల విగ్రహం, భారీ శరీరం, పిడికెడు పిడికెడు మీసాలు, బంగారు కళ్ళద్దాలు, ఉల్లిపొర ధోవతి, సిల్కులాల్చీ, బంగారపురంగు గడియారం, బంగారు ఉంగరాలు...కాళ్ళకు పాంకోళ్ళు, క్రూరమైనచూపులు, బూతుమయమైన నోరు ... అని సమాధానమొస్తుంది.

అచ్చం అలాంటి దొరవారే ఉప్పరిపల్లె దొరవారు.

దొరకు లెక్కలేనన్ని ఎకరాల భూములున్నాయి. ఇప్పటికీ వున్నాయా? అంటే వున్నాయిమరి!

మానవుడు కొత్తగా వ్యవసాయం

**ఉప్పల నరసింహం**

చేస్తున్న రోజుల్లో, ఆ తరువాతా పశువు లను సంపదగా భావించేవారట. వెంక ట్రామారెడ్డి ఇప్పటికీ పశువులను సంపద గానే భావిస్తాడు. ఆయనకు నాలుగు దొడ్ల నిండా పశువులున్నాయి. అవి మామూలు పశువుల్లా బక్కపల్చగా డొక్కలు ఎండి, ఎముకలు తేలినవికావు. దొరలాగే అవికూడా ప్రత్యేకంగా కని పిస్తాయి!

వెంకట్రామరెడ్డికి ట్రాక్టర్ వుంది. ఇరవై వరకు నాగళ్ళు వున్నాయి. సాగు చేసే భూమికన్నా సాగుచేయని భూమే ఎక్కువగా వుంది. ఆ భూమిని పశువుల మేతకు వదిలేసాడు.

ఊరి మధ్యలో శ్రీరాములవారి గుడి ప్రక్కన వున్న భవనం దొరది. ఈ భవనం నిజాం హయాంలో కట్టింది. దాదాపు అరఎకరంలో వున్న భవనం ముస్లిం, హిందూ వాస్తు శిల్ప రీత్యా కట్టినది. విశాలమైన కాంపౌండ్-కాంపౌండ్‌లో వివిధ రకాల పూలచెట్లు, పళ్ళచెట్లు వున్నాయి.

ఆ భవనాన్ని ఆనుకునే మరో చిన్న అందమైన ఇల్లు వుంది. అదే కచ్చీరు.

ఆ కచ్చీరులోనే వెంకట్రామరెడ్డి ఉదయంరెండుగంటలు, సాయంత్రంరెండు గంటలు కూర్చుని వ్యవహారాలు చూస్తూ వుంటాడు.

ఉదయం——

కచ్చేర్లో దిండుమీద టర్కీ టవల్ వేసివున్న కుర్చీలో కూర్చుని ఎదురుగా వున్న బల్లపై బంధువు తెచ్చిన ఆనాటి పేపరు చదువుతూ వున్నాడు వెంక ట్రామారెడ్డి,

దొరకు అభిముఖంగా మూడు కుర్చీలు వేసివున్నాయి. ఓ కుర్చీలో దొరగారి బంధువు కూర్చుని గది నలు మూలలా పరికిస్తూ వున్నాడు.

వెంకట్రామారెడ్డి కూర్చున్న కుర్చీ ప్రక్కన కర్రబీరువావుంది. అందులో ప్రామిసరినోట్లు, పాతకాగి తాలు వున్నాయి. గోడలకు పాతపటాలు, మ్యాపులు వ్రేలాడుతూవున్నాయి.

రెడ్డి కూర్చున్న ఎదురుగోడకు యాదగిరి లక్ష్మీనరసింహస్వామిపటం వుంది. దాని ప్రక్కకు ప్రత్యేక శ్రద్ధతో ఫ్రేమ్ కట్టించిన వెంకట్రామా రెడ్డి తండ్రి ఫోటో వుంది.

గోడవారకు రెండు బెంచీలున్నాయి. రెండు కుర్చీలున్నాయి. గదిమూలన నాలుగుకాళ్ళ 'పెద్దపీట' వుంది. దానిపై మరికొన్ని కాగితాల కట్టలు ఎర్రగుడ్డ లతో చుట్టివున్నాయి.

క్రింద గచ్చు శుభ్రంగా వుంది.

కచ్చీరు గేటు ఈవల కావలి ముత్యాలు బరిసె కర్ర పట్టుకుని ద్వారపాలకు డిలా నిల్చున్నాడు.

మెట్లవద్ద చెట్టుప్రక్క కుమ్మరి నర్సిమ్మదొరను కలుద్దామని చేతులుకట్టు కుని నిల్చున్నాడు. దొర ఏదో చదువు తున్నాడని ఏమిచెప్పకుండా అలాగే నిలుచున్నాడు.

దొరవారు నర్సిమ్మను నిర్లక్ష్యంగా చూపు చూసాడు.

ఓదొరచూడగానే నిర్సిమ్మ రెండ.




చేతులు జోడించి "దండంపటేలా" అన్నాడు.

వెంకట్రామరెడ్డి తలకొద్దిగా కదిపి తిరిగి పేపరు చదవసాగాడు.

ఇంతలో మీసాల మల్లయ్య చేతిలో నిలువెత్తు వెలిలకర్రను పట్టుకునివచ్చి మెట్లవద్ద నిల్చున్నాడు.

కండలుదేరిన మల్లయ్య శరీరానికి వేసుకున్న నూతక కమీజు బిగుతుగా వుంది. ధోవతి పైకి ఎగకట్టి బొడ్డువద్ద చెంగుదోపాడు. పెద్దపెద్ద మీసాలను సవరించుకుంటూ, మెడలోని తాయత్తును వదులు చేసుకుంటూ నిల్చున్నాడు.

వెంకట్రామారెడ్డి మల్లయ్యను చూసి పేపరుమూసి బల్లమీద పెట్టి "ఏమా యెరా పొద్దుగాల్ల పొద్దుగాల్లనే ఊరు అడింకొచ్చినవ్?" అని కంచుకంఠంతో గాడు.

దొరగారు బంధుపు పేపరు తీసుకుని చూడసాగాడు.

మీసాల మల్లయ్య నీళ్ళుమింగుతూ, జంకుగా "ఏం లేదు పటేలా..." అన్నాడు ఏదో అపజయాన్ని అంగీకరిస్తున్నట్టుగా.

"మరేం పనిమీదొచ్చినవ్రా?" కాఠిన్యంతో కూడిన ప్రశ్న.

సమాధానంలేదు.

"కాలువకాడికి పోయొచ్చినావా?"

"పోయిన"

"ఎంతవరకొచ్చింది పని?"

"కమ్మరోని బొందదాక అయింది పటేలా..."

"పని జరుగుతుందా? ఏమైన ఎట మటం అయితుందా?... కూలోళ్ళు, జీత గాళ్ళు సక్కగ పని చేస్తుంట్రా లేదా?..."

"...కూలోళ్ళు, జీతగాళ్ళు పనిచేస్తు న్నర్ గని...." అని తల గోక్కు న్నాడు. వెంకట్రామారెడ్డి కుర్చీమీద మడిచిపెట్టుకున్న ఎడమకాలును క్రిందికి తీసి "ఆఁ....ఏమయిందిరా?"

దొరగారి బంధువు పేపర్లో౦చి మీసాల మల్లయ్యను ఓసారిచూసి తిరిగి చదువుకోసాగాడు.

దొర తీక్షణంగా మల్లయ్యనే చూస్తూ వున్నాడు.

"...తెనుగు రాములుగాడు తన పొలంల కేలి కాలువ తీయనీయనని పని రూకాయించిండు..." అని మీసాల మల్లయ్య నేలచూపులు చూస్తూ నిలుచు న్నాడు.

చెట్టు ప్రక్కన వుండి కుమ్మరి నర్సిమ్మ వింటూ వున్నాడు.

దొరవారు నొసలు చిట్లించి

"రూకాయించిండు?..." ఏదో కొత్త విషయం విన్నట్టుగా ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును పటేలా" మల్లయ్య దొరను సూటిగా చూస్తూ చెప్పాడు.

దొరవారి కను కొలుకుల్లో ఎర్రద నం పొడసూపింది.

"ఏంమాట్లాడుతున్నవ్‌రా? -హోష్‌తోనే (తెలివి వుండి) మాట్లాడ్తున్నవా?" ఆగ్రహంతో, రౌద్రంగా చూస్తూ అడిగాడు.

"గమేల (ఇనుపతట్ట)డు మన్ను గూడ తీయనీయనని రాములుగడ్డపారకు అడ్డం నిలబడ్డడు పటేలా" హీనస్వరంతో చెప్పాడు.

"ఊఁ...."

"జీతగాళ్ళు వాన్ని కేర్ జెయ్యకుంట తొవ్వతావుంటే సర్రునపోయి గొడ్డలి తీసుకొని వొచ్చిండు పటేలా-"ఎవడన్న గడ్డపార నాభూమిల దిగేస్తే వాని తల నరుకుతా" నని నిలబడ్డడు - దాంతోటి జీతగాళ్ళు, కూలోళ్ళు భయపడ్డారు..... ఎవ్వడూ తొవ్వనీకి ముందుకు రాలే పటేలా......"

"ఊఁ......"

"మీపటేలు ఒక్కని పొలంకు చెరు వులకేలి కాలువదీసి నీళ్ళు పెట్టుకుంతం దుకు అందరి పొలాల నుంచి జాగా (స్థలం) ఇయ్యాలె? పొలం పాడుజేసుకో వాలె?...ఎవర్నడిగి మీ పటేలు కాలువ తీపిస్తున్నడు? చెరువుల నీళ్ళు ఒక్కడు పారపెట్టుకుంతందుకు ఏమి అధికారం ఉంది? చెరువు కింద పొలాలన్ని ఎండి పోవాల్నా... అని ఇంకా చాల చాల మాటలన్నాడు పటేలా......"

తెలుగు రాములు అన్నవి, అననివి అన్నీ కలిపి దొరకు చెప్పుతున్నాడు మల్లయ్య.

దొరవారు "హుఁ..." అని మీసాలు పైకి తిప్పుతూ వింటూ ఉన్నాడు.

"పటేలు చెప్పినా మీకు సిగ్గులేదురా కాలువ తీయనీకి...మంచి పొలాల నుంచి కాలువ తీస్తే ఎంత పొలం నష్టమైతదో తెలువదామీకు? బువ్వ తింటలేరా? గడ్డి

⑥ డాక్టర్లు...




తింటున్నారు?...ఒకరు పెంటతిసుమంటె తింటరా?...అని ఇంకేమెమో తిట్టిండు పటేలా..." అని చెప్పి ముగించ పోయాడు.

"మరి మీరేం పీకిండ్రురా?" పండ్లు బిగపట్టి అడిగాడు దొరవారు.

మీసాల మల్లయ్య ఆ ప్రశ్నకు ఖంగు తిన్నాడు. వెంటనే ఏమి సమాధానం చెప్పాలో తోచలేదు. మౌనంగా ఉండి పోయాడు.

"ఆడిదాని లెక్క, చేతులు కట్టుకుని ఉరుకొచ్చినావ్?..." అవహేళనగా, ఈసడింపుగాఅన్నాడు వెంకట్రామారెడ్డి.

"ఏమి జెయ్యాల్నో తోయలేదు పటేలా...వాడు ఎప్పుడు మనజోలికి రానోడాయే...ఈ సంగతి మీ చెవుల ఏశిపోదామని వొచ్చిన-యిప్పుడు మీరు ఏంజెయ్యమంటే అదిజేస్త..... " అని వినయంగా నివేదించుకున్నాడు మీసాల మల్లయ్య.

మల్లయ్య మాట పూర్తికాకముందే దొరవారు

"చేతులు లేనోళ్ళదగ్గర్కి-పోండ్రి.... నీయమ్మ చాతకాని ముఖాలల్ల మంది ......" అని బూతులు తిట్టాడు.

మీసాల మల్లయ్య మనసు మూలలకు దెబ్బతగిలింది. అయినా చేసేది ఏమీలేక నిశ్చలంగా అక్కడే నిల్చున్నాడు.

దొరవారు కొద్ది సేపు ఆలోచించి, దీర్ఘంగా శ్వాస వదిలి

"ఆడు ఏడున్నడురా యిప్పుడు?" అని అడిగాడు.

"రాముడుగాడా పటేలా?"

"ఆఁ...రాములుగాడేనోయ్..."

"యింటికొచ్చినట్టుంది పటేలా?"

"అరే కావలోడ..."దొరవారి కేకకు గది దద్దరిల్లింది.

"అయ్యా..."

అంటూ కావలి ముత్యాలు పరుగు పరుగున గేటువద్దనుంచి వచ్చి మెట్లవద్ద మల్లయ్య ప్రక్కన నిల్చున్నాడు.

"ఆ తెనుగురాములుగాన్ని ఏడున్నా పట్టుకరా పో..." అని ఆజ్ఞాపించాడు.

"మంచిదయ్యా..." అంటూ కదల బోయాడు ముత్యాలు.

"అటుపోయి, ఇ టు రా వా లే ... ఉరుకు."

"అట్లనే..." అని కావలి ముత్యాలు నిజంగానే పరుగు అందుకున్నాడు.

మీసాలమల్లయ్య కొంత ప్రక్కకు జరిగి కర్రమీద గడ్డంఆనించి ఆలోచిస్తూ నిలుచున్నాడు.

చెట్టు ప్రక్కనుంచి కుమ్మరినర్సిమ్మ కొంత ముందుకు జరిగి,తలమీది రుమాలు సంకలో పెట్టుకుని, చేతులు కట్టుకుని దీనంగా చూస్తూ నిల్చున్నాడు.

దొరవారు నర్సిమ్మను చూడగానే,

"నీ కథ ఏందిరా?..."కనుబొమ్మలు ఎగరేస్తూ అడిగాడు.

ఎలా చెప్పాలో తెలియక, తికమక పడుతూ నీళ్ళు మింగుతూ నిల్చున్నాడు నర్సిమ్మ.

"చెప్పవేందిరా?" అని గదిరిచ్చాడు.

నర్సిమ్మ గజ్జున వొణికాక,

"పొలంలకేలి జీ త గా ళ్ళు కాలువ తీసిండ్రు పటేలా..." పూడుకుపోయిన గొంతుతో చెప్పాడు.

"అయితే ఏమంటున్నవ్‌రా?" నిర్ల క్ష్యంగా చూస్తూ అన్నాడు దొరవారు.

"...ఏంలేదు పటేలా- పంటపొలంల కేలి తీసిండ్రు..."

"ఎ ం త రా అ ద్ద గ జ ం తో దేగద కాలువ..."

"మన్ను అది ఇదీ ఏశి చాలపొలమే నష్టమైంది నీ బాంచను..."

"ఏంగాదు పో-నువ్వు మ ల్లొ చ్చి కలువు పో..."

నర్సిమ్మ ఏదో చెప్పబోయాడు.

"నువ్ నాకింక ఏమి చెప్పొద్దు, నువ్ మల్ల కలువు పో..."

అని వెంకట్రామారెడ్డి కుర్చీలోంచి లేచి పెరట్లోకి వెళ్ళాడు.

వెంకట్రామారెడ్డి తిరిగి కచ్చీర్లోకి వచ్చేసరికి కుమ్మరి నర్సిమ్మ అడుగులో అడుగేసుకుంటూ, తల నిమురుకుంటూ గేటు దాటుతున్నాడు.

మీసాలమల్లయ్యపోతున్న నర్సిమ్మను చూస్తూ వున్నాడు.

దొ ర వా రు తిరిగి తన కుర్చీలో కూర్చుని కాలువ అవసరాన్ని గురించి వచ్చిన బ ం ధు వు కు వివరించి చెపు తున్నాడు.

ఆయన ఊఁ...కొడుతూ వింటూ ఉన్నాడు.

• • •

కావలి ముత్యాలు, తెనుగురాములు ఇంటికి చేరే సరికి రాములు పెద్దపీటమీద కూర్చుని జనుమును ఎడమ పాదంక్రింద అదిమిపట్టి తాడు పేనుతున్నాడు. పని చేయడానికి వీలుగా ధోవతిని తొడల




దాకా లాక్కున్నాడు. చేతికి వెండిదండె కడెం వుంది. సైనుగుడ్డ బనియను వేసుకున్నాడు. ఆ బనియను జేబులో జెక ముక తోలుసంచివుంది.

చిన్న కళ్ళను మరింత చిన్నగచేసి చేసి రాములు వస్తున్న ముత్యాలును చూసాడు. పొట్టిగావున్న మీసాలమీద ఈగవాలితే మీసాలను మోకాలికి రుద్దుకున్నాడు. ఈగ ఎగిరిపోయింది.

పెద్దపీట్రకింద నగ్నంగా కూర్చుని రొట్టెముక్కతింటూవుంది రాములు చిన్న కూతురు-నడిపికొడుకు గడపపై కూర్చునితింటూ వున్నాడు - దగ్గరలో కుక్క రొట్టెనే చూస్తూ కూర్చుంది. ఇంటిలోపల పొయ్యివద్ద రాములు భార్య పాపమ్మ రొట్టెలుచేస్తూవుంది. ఆమెంకు టింట్లో రొట్టె చేస్తున్న చప్పుడు ప్రతి ధ్వనిస్తుంది. రాములు పెద్దకొడుకు ఆంజనేయులు పొలంవద్దనే వున్నాడు.

దగ్గరకు వచ్చిన కావలి ముత్యాలు నుద్దేశించి.

"కూసోకాక...." అన్నాడురాములు.

"కూసుంటగాని పటేలు నిన్నురమ్మన్నడు" డొంకతిరుగుడు లేకుండా చెప్పాడు ముత్యాలు.

ఎందుకూ?...." ఎందుకోతెలిసికూడ తెలియనట్టు అడిగాడు రాములు.

"ఏమో నాకు తెల్వాదు బిడ్డా"

"...అయితే జెర్ర ఆగి వస్తపా..." అన్నాడు రాములు.

నిల్చునే వున్న ముత్యాలు కుడి చేతిలోవున్న బరిసెకర్రని ఎడంచేతి లోకి మార్చుకుంటూ. "నిన్ను ఎంట పెట్టుక రమ్మన్నాడురా పటేలూ..."

అని అన్నాడు.

"అట్లనా?..." పేనుతున్న తాడు 'కరి' విడిపోకుండా ముడివేసాడు రాములు.

"అవును" అన్నట్టు తలవూపాడు ముత్యాలు.

"అ యి తే పద...." అంటూ దూలంపై చేతిలోని తాడువేసి, పాపమ్మ నుద్దేశించి.

"నేను జెర కచ్చీరుదాక పోయొస్త" అన్నాడు రాములు.

"ఎందుకూ?" అని లోపలినుంచే ప్రశ్నించింది భార్య.

"పటేలు రమ్మన్నడంట!"

"ఇంత రొట్టెతినిపోమరి" అందిఆమె. "లేదు-వొచ్చినంకతింట" అంటూరాములు వాకిట్లోకి నడిచాడు.

తెనుగురాములు అతని వెనకాల కావలి ముత్యాలు కచ్చీర్లోకి అడుగు పెట్టారు.

వెంకట్రామారెడ్డి అడుగులచప్పుడు విని గేటువైపు తల తిప్పాడు.

"దండం పటేలా..." నమస్కరించాడు రాములు.

దొరవారు తల ఊపాడు.

రాములు మెట్లవద్ద కొద్దిసేపు నిశ్శబ్దంగా నిల్చున్నాడు.

దొరవారు మింగేసేట్టు రాములును చూస్తూ వున్నాడు. అలాచూస్తూనే "పని రొకాయించిన వంట ఏం సంగతిరా?" సవాలు చేస్తున్నట్టుగా వుంది ఆ గొంతు.

"ఇప్పుడే పూతకొస్తున్న వంకాయ చెట్లల్లకేలి కాల్వ తీస్తాంటే నేనే తీయొద్దన్న..." వినమ్రతతో చెప్పాడు రాములు.

"ఇంకేమన్నవ్?"

"ఇంకేమన్నపటేలా...నాకు ఉన్నదె రెండున్నర ఎకరాల భూమి-దాంట్లోకేలి గజం ఎల్పు (వెడల్పు) తోసి కాలువ తీస్తే ఎంత పొలం నష్టమైతదో మీకు తెలుసు గదా పటేలా..."

"నీ ఒక్కని పొలం నష్టపోతుందా? అందరి పొలాలు నష్టం అయితున్నయా? ఎవ్వడు ఏమంటలేడుగాని నువ్వే ఎగురుతున్న వేమిరా?..."

"అందరి పొలాలనుంచి కాలువ తీయడు న్యాయమైన పనే" అన్న వాదన ఆ మాటలో ద్యోతకమైంది.

"అందరి సంగతి వేరు - నా సంగతి వేరు గద పటేలా...." వినయంగా అన్నాడు రాములు.

"నువ్వు మొగులు (ఆకాశం) మీదికేలి దిగొచ్చినవారా? నీ సంగతి వేరు అయితందుకు? ఆఁ..."

"నేనేం మొగులు మీదికేలి దిగిరాలేదు గని..." ఏదో చెప్పబోయాడు రాములు

"ఏమో మాటకు మాటిస్తున్నవ్ ఏం సంగతిరా నీది?"

దొరవారు కుర్చీలోంచి లేచారు.

మీసాల మల్లయ్య సర్దుకుని నిల్చున్నాడు.

దొరగారి బంధువు ఏమి జరుగనున్నదోనని చూస్తున్నాడు.

కావలి ముత్యాలు గేటు వద్ద తన స్థానంలో నిలుచున్నాడు.

రాములు తొణకకుండా

"ఏం సంగతి లేదు పటేలా....... నా పొలంలకేలి కాలువ తియనీయ" అన్నాడు.

# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."

నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడర్.






2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీం' మరియు
'చందనం.'

నైసిల్
తెచ్చుకోండి
చెమటకాయల
బాధ మరిచిపోండి.



ఔషధ యుక్త-నైసిల్
1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మ జీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

"తీయనీయవా? తీస్తే ఏంజేస్తవ్‌రా?" చివరి సవాలు చేస్తున్నట్టుగా అన్నాడు దొరవారు.

అదే ప్రశాంతతతో.

"కాలువతీసెటోని పానమన్న పోవాలె, నాపాణమన్న పోవాలే ..." అన్నాడు రాములు.

"తొండ ముదిరి ఊసరెల్లి అయి నట్టుంది- అరె మల్లిగా వాన్ని నాలుగు తన్ని వాని కాపురం యొంచురా...వాడె మోలావు నీల్గుతున్నడు.. వీనియమ్మ."

దొరవారు ఆజ్ఞాపించేసరికి మీసాల మల్లయ్య రాములు మీద పడ్డాడు. ఇద్దరు కలబడి అటుదొర్లి, ఇటుదొర్లి గుద్దుకో సాగారు. కొడి పుంజుల్లా ఇద్దరు కొట్లాడు కుంటూవుంటే దొరవారి బంధువు కుర్చీ లోంచి లేచి వింతగా చూడసాగాడు.

వెంకట్రామా రెడ్డి ఏమనుకున్నాడో గాని ఇద్దరికి దెబ్బలు తగులుతూ వుంటే "అరేయ్..." అని కేకేసాడు.

మల్లయ్య, రాములును వదిలాడు.

అప్పటికే రాములు మోకాళ్ళకు, మోచేతులకు చర్మం గీరుకపోయి కొద్దిగా రక్తం కారుతూవుంది.

మల్లయ్యకు కూడా కొన్ని దెబ్బలు తగిలాయి.

ధోవతులు సరిజేసుకుంటూ ఇద్దరూ ఒకరి నొకరు శత్రువుల్లా, కోపంగా చూసుకుంటూ ఉన్నారు.

రాములు మనసులో కసి పెరిగింది. పంతం హెచ్చింది. తెగింపు రెట్టింపు అయింది. అదే కోపంతో వెంకట్రామా రెడ్డిని తీక్షణంగా చూస్తు.

"సూస్తే...కాలువ ... తీస్తరో- నాభూమిలకేలి కాలువతీయాలనుకుంటరు, నన్ను కొట్టిపిస్తారు...సూస్త ఎవడొస్తడో నాపొలంకాడికి..."

ఆ వే శ ం గా అంటూ ధోవతి పైకి లాక్కుని, తగిలిన గాయాలను చూసు కుంటూ కోపంగా పరుగుపరుగున గేటు దాటాడు.

వెంకట్రామా రెడ్డి నిశ్చేష్టుడైయ్యాడు.

దొ ర వా రి కి ఏమీ అర్థంగాకుండా వు ం ది. ఇన్ని సంవత్సరాల ను ం చి ఎవ్వరూ ఎదురుగా పల్లెత్తి మాట్లాడని వాళ్ళు-ఇప్పుడు రాములుగాడు ఎంతగా ఎగిదాడు-ఎన్నెన్ని మాటలన్నాడు. ఆ మాటలను తలుచుకుంటే దొ ర వా రి కి ఉక్రోషం పెరగసాగింది. తన అహం దెబ్బతిన్నది. బంధువు ముందు తన అధి కారాన్ని సవాల్ చేసినట్టు అనిపించింది. నిలువెల్లా కోపం ముంచుకొచ్చింది.

కళ్ళు ఎర్రబడ్డాయి. ముక్కుపుటలు అదిరాయి. అప్రయత్నంగా చేతులు మీసాలమీది కెళ్ళాయి.

వెంటనే ఓ కాగితం తీసుకుని ఓ చీటి రాసాడు.

కావలి ముత్యాలును పిలిచి ఆ చీటీ అందించి ఏదో చెప్పాడు.

రాములును ప టే లు కొట్టించాడని అప్పటికే దాదాపు చాలామందికి తెలిసింది ఊర్లో-ఇంటివద్ద పాపమ్మ సంగతి తెలిసి శోకాలు తీస్తూ కూర్చుంది.

వెంకట్రామా రెడ్డి, అతని బంధువు భోజనానికి బంగళాకు బయలు దేరారు.

రాగిచెట్టు క్రింద ఆంజనేయ విగ్రహం వద్ద రైతులు, ముసలివాళ్ళు పిచ్చాపాటి మాట్లాడుతున్నవారు రాములు వార్తవిని




ఆశ్చర్యపోయారు.

అదే దారిన ఇంటికిపోతున్న రాములు కనిపించాడు వాళ్ళకు. కాని ఎవ్వరూ రాములును పిలిచే సాహసం చేయలేదు.

రాములు స్వతహాగా మిత భాషి. ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడడు. ఎవ్వరితోనూ కలిసితిరిగడు. తన బావి, ఇల్లు తప్ప మరో ధ్యాసలేనివాడు. అలాంటి రాములును పిలిచి "ఏమైంది?" అని అడగడానికి జంకుగా వుంది అందరికి-

రాములు వీథి మలుపు తిరిగాక కొద్ది సేపటికి, రాగి చెట్టు మొదట కూర్చున్న గొల్ల కొమరయ్య కొడుకు బీరప్ప.

"రోజు రోజుకు పటేలు జులుం ఎక్కువైతుందే...పాపం ఆ రాములు తెరువుపోతడు? ఎవని జోలుకి పోతడు? తన పొలం ఏందో, తన ఇల్లేందో, ముంగిలేదో తను సూసుకుంటడు! అసుంటోన్ని కచ్చీరుకు పిలిపిచ్చి బర్రెలెక్క-బలిసిన ఆ మీసాల మల్లయ్యతోని కొట్టిపిస్తాడు? పొలంలకేలి కాలువ తీయనీయనందే గట్ల కొట్టరా?...కుమ్మరి నర్సిమ్మడు పోయి అడిగితే 'ఏంగాదు పో' అని తరిమిండట కచ్చీర్లకేలి-చెరువుల కేలి నీళ్ళు ఒక్కడే పారపెట్టుకుంతకు కట్టించిందా సర్కారు?..." అని బీమిడి పాపిరెడ్డి తాతను ప్రశ్నించాడు.

నిండా గొంగలి కప్పుకుని, చుట్ట తాగుతూ, క్షణక్షణానికి ఉమ్మిని ఉంచుతూ కూచున్న పాపిరెడ్డి,

"పటేలుకోసం సర్కారు చెరువు

కట్టియ్యలేపు నిజమేరా. మరి చెరువుల కేలి కాలువతీస్తున్నప్పుడే ఎవడన్న అడ్డం నిలవడితే కాలువ కమ్మరోని బొందదాక వొచ్చేదా?" అని ప్రశ్నించాడు.

"ఒకరిద్దరు అడ్డం నిలవడితే పని రొకొంచుతరా? అందరూ పనికి అడ్డం నిలవడాలే గాని..." అని అన్నాడు బీరప్ప.

"ఊరంత ఎప్పుడురారురాపిచ్చోడా. ఊరంత పటేలు పనికి అడ్డం జెప్పితే పటేలు ఇంత సంపాయించకపోతుండే. ఇన్నిభూములు కబ్జ జేయక పోతుండె. రజాకార్లప్పుడు, పోలీస్ ఆక్షన్ అయినంక తురుకోల్లు పొలాలన్ని అన్యాయంగా కబ్జ జేసినా ఎవ్వరూ ఏమనలే. కొట్టికొట్టం జేసుడు...ఏరిగించి ఎత్తిపోసుడు సీయసుంటి నాయసుంటివోళ్ళ పనయితే అలగ్గున పుణ్యానికొచ్చిన భూములుకబ్జ జేసుడు పటేలుపనయింది. అయినంక ఎంతమంది భూములు అగ్గదగా నంగా అడ్డికి పావుశేరు లెక్క గుంజుకో లేదు? ఎంతమందికి పంచాదులు తెర్వ జేస్తనని "బయాన"లు తీసుకుని ఎగ గొట్టలేదు. ఎంతమందికి కరెంటు మోటర్లు ఇప్పిస్తానని పైసల్ ఎగదొబ్బలేదు? అప్పు కిందికి ఎంతమంది పొలాలు దోసుకున్నాడు? గట్ల జరిగినప్పుడల్లా ఊరంద రొచ్చిండ్రా అడ్డం-ఎవడురాకపోయె ఎవన్నైతే దోసుకున్నడో ఆడే ముందుకు రాకపాయే ఇగ ఊరంత ఏడికేలి పస్త రురా? ఇయ్యాల ఒక్కడు రాములుగాడు మర్లవడితే మీసాల మల్లిగానితోని కొట్టి పిచ్చిండు అని నువ్వే చెప్పినవి..." అని పాపిరెడ్డి మధ్య మధ్యన ఛుమ్మఉంచుతూ గతం సంగతులు చెప్పాడు.

"మరి ఎట్లంటవే?" అని అడిగాడు మరో రైతు.

"ఎట్లనేదేముండిరా! మీకు తాతనయితే లడాయి చేయిండ్రి. లేకపోతే మీ పని మీరు జూసుకోండ్రి...అంతకన్నా ఇంకేం జేస్తరు జెప్పు?"

బీరప్పకు, అక్కడున్న యువకులకు పాపిరెడ్డి తాత మాటలు అసంతృప్తిగానే తోచాయి.

... ... ...

సాయంత్రం——

జీపులో కావలి ముత్యాలు వచ్చాడు. వెంట పోలీసులూ వచ్చారు.

వెంకట్రామారెడ్డి కచ్చీర్లకు పోలీసులు రాగానే జరిగిన విషయమంతా వివరించి చెప్పాడు.

ఎస్.ఐ. నారాయణస్వామి శ్రద్ధగా విన్నాడు. విన్న తరువాత గట్టిగా ఊపిరి వదిలి.

"మీకెందుకు సార్, వాణ్ణి అటెంప్ట్ మర్డర్ కేసు క్రింద బుక్ చేసి దొక్కలన్ని యిరిసేస్త..." అని హామీ ఇచ్చాడు.

ఎస్.ఐ. సర్దవలసింది సర్ది పంపాడు.

జీపులో కావలి ముత్యాలునుఎక్కించుకుని నేరుగా తెసుగు రాములు ఇంటికి బయలుదేరాడు నారాయణస్వామి.

గొంగడి క్రింద వేసుకుని, చుట్ట త్రాగుతూ ఆలోచిస్తున్న రాములు పోలీసులను చూడగానే గుండె ఆగినంత పని యింది.

అప్రయత్నంగా చుట్ట క్రిందరాసి ఆర్పేశాడు. వెర్రిగా అటూ, ఇటూ చూశాడు.




డాక్టర్లు కథకి ముగింపు జోకు 97 పేజీ చూడండి!

బూట్ల చప్పుడు విని పాపమ్మ బయటకువచ్చి పోలీసులనుచూసి ఏడ్చుఅందుకుంది. తల్లినిచూసి పిల్లలు ఏడ్వసాగారు. అక్కడి వాతావరణమంతా కురిసే మేఘంలా "బరువు"గా వుంది.

కావలి ముత్యాలు రాములును చూయిస్తూ,

"ఈయనె దొరా తెనుగురాములు" అని చెప్పాడు ఎస్.ఐ.తో.

నారాయణస్వామి కానిస్టేబుళ్ళకు చెప్పి రాములును జీపు ఎక్కించాడు.

పాపమ్మ తెగిన కట్టలా ఏడుస్తూ నారాయణస్వామి పాదాలమీద పడింది. కాని లాభంలేదు. దొరవారు మాటను కాదనలేదు ఎస్.ఐ.

నిర్దయంగా పాపమ్మను విదిలించుకుని జీపు ఎక్కి పోలీసుస్టేషన్ వచ్చాడు నారాయణస్వామి.

ఆ రాత్రి రాములు ఒళ్ళు హూనమయింది. అరిచినా, గీపెట్టినా తగలాల్సిన దెబ్బలు బలంగానే తగిలాయి.

ఉదయం...

మూత్రం వాసనతో కంపుకొడుతున్న లాకప్ రూంలో రాములు తలుపు వద్ద కూర్చున్నాడు-ఎన్ని దోమలు కుట్టినా ఖాతరు చేయకుండా ఏదో తీవ్రంగా ఆలోచిస్తూన్నాడు.

భార్య, పిల్లడు, పొలం, ఎద్దులు, వంకాయచెట్లు, వరిపొలం కళ్ళలో కదులుతున్నాయి. వీటినన్నింటిని వెంకట్రామ

## ఇదీ వరస...




నెల వానల్లో ఇది సత్య కథల వరస



## కార్టూన్ ఇష్టులకీ, పాఠకులకీ 'సరదా ఖద'

శ్రీ బత్తులగారు ఆ( ఈ)మధ్య మేము ప్రచురించిన/ప్రచురిస్తున్న శీర్షికలమీద కార్టూన్‌లు వేశారు.. అవధరించండి

## తొలిమాట




నెల

నెలా..

## ఉత్తరాలు




కథలు, నవలలూ చదివి తమ

అభిప్రాయాల్ని చెప్పడం

కష్టమైన మంచిపనే!

## సీరియల్




ప్లీజ్
సీ రియల్"

## కొత్తపుస్తకంతో కొంతసేపు




కాస్సేపు అలా ...
శీర్షిక చదవైనా ఆ ఫలానా పుస్తకం
కొనాలని సదుద్దేశం!

## చందాదారులు'




... దారులకి ప్రత్యేక శీర్షిక!
డ్రాఫ్ట్, ఎం వో....

రెడ్డి అరికాలితో నలిపేస్తున్నట్టు భయంగా ఉంది మనసులో.

పదిగంటలు దాటినా లాకప్‌రూం లోంచి రాములును బయటకు విడువ లేదు. వచ్చేపోయేవారిని, పశువులను, మేకలను, చూస్తూ కూర్చున్నాడు రాములు.

వెంకటరామారెడ్డికి ఇంత కోపం ఎందుకో అర్థం కాలేదు.

పాపమ్మకు ఎవరో ఇచ్చిన సలహా ప్రకారం చేతి బంగారం కడెం కోమటి ఆంజయ్యకు తెగనమ్మి వెయ్యిరూపాయలు తీసుకుని పోలీస్టేషన్‌కు పెద్దకొడుకు ఆంజనేయులుతో ప్రయాణమైయింది.

ఎస్.ఐ. నారాయణస్వామి కాళ్ళమీద పడి గోడు అంతా చెప్పుకుని కొంగులో కట్టుకున్న వెయ్యిరూపాయలు తీసింది.

కొంతసేపు బూతులు తిట్టి, వదిలి పెట్టనని కేకలువేసి చివరకు ఊర్లో వెంకట్రామరెడ్డికి వ్యతిరేకంగా ప్రవర్తించనని మాట ఇచ్చాక రాములును వదిలాడు.

లాకప్ రూం లో నుంచి మౌనంగా రాములు బయటకు రాగానే పాపమ్మ తాను ఎక్కడున్నది గమనించకుండా గట్టిగా ఏడ్వసాగింది భర్తని పట్టుకుని.

ముగ్గురూ ఉప్పరిపల్లె దారిపట్టారు- మధ్యలో లారీ ఎక్కి ఊరు చేరారు.

రాములు పోలీస్ స్టేషన్ నుంచి వచ్చాడన్న విషయం గ్రామస్తులందరికి తెలిసిపోయింది. చాలామంది గర్వంగా సంతోషంగా నవ్వుకున్నారు. కాని వెంకట్రామారెడ్డి పళ్లు కొరికాడు.

అదే రాత్రికి వెంకట్రామారెడ్డి బావి వద్ద గడ్డివాములు తగలబడ్డాయి.

తెనుగురాములు వెంకట్రామారెడ్డి మీది కోపంతో గడ్డివాములు తగులబెట్టా డని ఊరంతా ఉదయం వరకు ప్రచారం జరిగించి.

వెంటనే రాములును కచ్చేరుకు పిలి పించాడు దొరవారు.

నడవలేక నడుస్తూ రాములు కావలి ముత్యాలు వెంట కచ్చేరుకు చేరాడు.

రాములు కచ్చేర్లో అడుగు [illegible]నే వెంకట్రామారెడ్డి పండ్లు పటపట [illegible] కుతూ గదిలో పచార్లు చేయసాగాడు.

తనుగురాములును 'ఖతం' చేయందె మనసుకు నిమ్మలంలేదు అ[illegible] ఎలా ఆ పని చేయటంఅనిఆలోచిస్తు[illegible]డు.

మీసాల మల్లయ్య

"రాములుగాడు వొచ్చిండు దొరా" దొర చూడలేదేమోనని చెప్పాడు.

రాజుకుంటున్న కాష్టంమీద పెట్రోలు పోసినట్టు మండిపడ్డాడు దొరవారు. చటు క్కున దొరవారు మెట్లుదిగి మల్లయ్య చేతిలోని కర్రను లాక్కొని రాములు మీదపడ్డాడు.

గేటువద్ద నిల్చున్న ఆంజనేయులుకు కళ్ళకు రక్తం వొచ్చింది తండ్రికితగులు తున్న దెబ్బలను చూసి.

కర్రలు కొట్టుకోవడానికి పోతున్న మైసయ్య సంకలోంచి గొడ్డలి అందుకుని ఆంజనేయులు పరుగుపరుగున క్షణంలో కచ్చేర్లోకివచ్చి వెంకట్రామారెడ్డి మీదికి విసిరాడు!!

గురి తప్పలేదు...సఫలం ఐంది.

చూస్తున్న జనం గట్టిగా కళ్ళుమూసు కున్నారు...తలలు దించుకున్నారు. •

# చైతన్యం

సులోచన దూరంగా చూస్తోంది.

కదిలే రైలులోంచి చూస్తోంటే ప్రకృతికి చైతన్యం వచ్చినట్టు తోస్తోంది. కాల చక్రం ముందుకు కదులుతోంది. ప్రకృతి వెనకి, కదులుతోంది.

''అమ్మా! అమ్మా''

సులోచన ప్రక్కకు తిరిగిచూచింది.

బేబీ! అయిదేళ్ళబేబీ! సన్నగా రోజ్ కలర్ బొమ్మలాంటి తన బేబీ!

''ఏమిటమ్మా?'' అడిగింది సులోచన. ఆమె చేతులు ఆప్యాయంగా బేబీ తల నిమురుతోన్నాయి.

"చెట్లు నిజంగా కదులుతోన్నాయా అమ్మా?" అడిగింది బేబీ.

"రైలు కదులుతోందికదా! అందుకే మనకి చెట్లు వెనక్కి పరుగెత్తినట్టు అని పిస్తుంది అంతే!"

''సైన్సు చెబుతోన్నావా బేబీకి?"

సులోచన తలెత్తింది. రాజశేఖరం పత్రిక చదువుకుంటూన్న వాడల్లా ఆగాడు,

"ఎంతయినా సైన్సు మాస్టారి అమ్మాయికదా!"

రాజశేఖరం కూతురును ఒడిలోకి లాక్కున్నాడు కిటికీలోంచి గాలిహాయిగా తగులుతోంది.

"కాన్వెంటులో మాట్లాడి వుంచారా?" అడిగింది సులోచన.

"సీటు యిస్తారు-ఒకటి రెండు నెలలు ఓపిక పట్టాలి" మాటలను గాలి తోసుకు పోతోంది.

''నన్ను నువ్వు రోజూ స్కూటర్‌తో దింపి రావాలి" బేబీ తండ్రిచెవులు నిమురు తోంది.

"తప్పకుండా!" కూతురును గుండెలకు అదుముకుంటున్నాడు రాజశేఖరం.

సులోచన తేలికగా వూపిరి పీల్చింది.

పల్లెటూరి బాధ వదిలింది. తన భర్త ఎం. ఎస్. సీ. చదివి కూడా యింటి దగ్గరే వుండిపోతానన్నాడు. పల్లెటూరిలో జీవితం ఏముంది? ఎదుగూ బొదుగూలేని జీవితం. మార్పు లేని దినచర్య. రాజశేఖరం వాటికిఏదో ప్రతివాదనలుచేశాడు.

"నా మాట ఎప్పుడు లక్ష్యపెట్టారు

గసక?" అంది తాను.

రాజశేఖరం విడ్డూరంగా చూశాడు.

"సులోచనా నీ మాటలు విడ్డూరంగా ఉన్నాయి. మనకి ఇక్కడ ఆస్తిపాస్తులున్నాయి. వాటిని సంరక్షించుకుంటూ వుండవద్దా?"

"ఆ మాత్రానికి మీరు ఎం. ఎస్. సీ చదివి వుండనక్కర్లేదు"

"అంటే?"

"మా నాన్నను పీడించుకుతిన్నారు, తావత్రయపడటం ఎందుకు!"

"నాకు కెమిస్ట్రీ చదవాలని........"

"పొలం గట్లమీద మీ అమ్మాయి తిరగాలని...."

"సులోచనా!"

"అవునండి. ఆలోచించండి. మనకి బేబీతోపాటు మరో బాబో పాపో పుడతారు. వాళ్ళు ఇక్కడ మట్టి తొక్కుకుని స్కూలో కవ్వల్లాగా...." వెక్కుతోంది తాను.



ఆయన ఏవో తిప్పలు పడ్డారు. ఇప్పుడు ఆ డిగ్రీని మూలనుపెట్టేస్తారా?"

"మీ నాన్న నన్ను చదివించాడనే కదా చెప్పతున్నావు?" రాజశేఖరం కఠినంగా అడిగాడు.

"ఉపయోగం లేనినాడు సీటుకుఅంత

రాజశేఖరం ఆలోచనలోపడ్డాడు.

ఆచరణకు నడుంకట్టాడు.

ఫలితంగా అతడు ఎక్కడ చదువుకున్నాడో అక్కడే ఉద్యోగంవచ్చింది.

"ఏమిటో దీర్ఘంగాఆలోచిస్తోన్నావు?" రాజశేఖరం మోచేత్తో పొడిచాడు.

సులోచన ఆలోచనలు కొలిక్కి తగిలాయి.

భర్తవంక ఆప్యాయంగా చూచింది. పరిస్థితులన్నీ కలిసివస్తే తనకి మరో ఎనిమిదినెలల్లో ప్రసవం వస్తుంది. తమ సంసారం అప్పటికి విశాఖపట్నంలో పునాదులు వేసుకుంటుంది.

బేబీ లోయర్ కె.జి. చదువుతోంటుంది.

"ఆలోచనలా-ఏమీ లేవు. కొత్త జీవితం ఎలాఉంటుందో...."

"ఏం-బాగానే ఉంటుంది. నవు కోరుకున్న జీవితమేకదా!"

"అంటే మీకు పూర్తిగాఇష్టంలేదా?"

"ఎందుకులేదు? నువు ఎక్కడఉంటే అక్కడే!" సులోచన పులకరించింది.

తమని ప్రయాణీకులు పట్టించుకోవడంలేదు. సులోచన ఆ విషయం గమనించింది. రాజశేఖరాన్ని మెల్లగా గిచ్చింది. అతడు ఆమె చేతిని అందిపుచ్చుకున్నాడు.

రైలు వాల్తేరు స్టేషన్‌లో ఆగింది.

రాజశేఖరం టాక్సీ మాట్లాడాడు.

హౌసింగ్ బోర్డు కాలనీలో తమ



ఇంటికి చేరుకునే సరికి మధ్యాహ్నం రెండైంది.

సులోచన వంటచేసింది.

బేబీ నిద్రకుపడింది.

"కాస్సమీరు అటూఇటూ తిరిగిరండి. పనిమనిషిని ఏర్పాటుచేసుకోవాలి" అంది సులోచన

"ఆల్‌రైట్! నాకు తెలిసిన వాళ్ళ దగ్గరకు వెళ్తాను. ఇల్లుజాగ్రత్త!" రాజశేఖరం రోడ్డెక్కాడు.

సాయంకాలంవరకూ తిరిగాడు. కాని తగిన పనిమనిషి దొరకలేదు తన స్నేహితులకు చెప్పి తిరిగివచ్చాడు రాజశేఖరం

సులోచన ఎవరితోనో మాట్లాడుతోంది.

రాజశేఖరాన్ని చూస్తూనే, "రండి. ఈవిడ మన ఇంట్లో పనికి కుదిరింది!" అంది సులోచన.

రాజశేఖరం బరువు దిగినట్టు ఫీలయ్యాడు.

"ఏమైనావుంటే పదవేయండమ్మా!" అంది పనిమనిషి. పమిట బిగించి.

రాజశేఖరం ఆమెవంక విచిత్రంగా చూశాడు.

ఆమెను చప్పున చూచి ఎవరూ పనిమనిషి అనుకోరు. చీరాబ్లవుజూ మాచింగ్ వేసింది. చేతులకు రెండేసి బంగారు గాజులు, మెడలో బంగారు నల్లపూసల దండ. మొహంలో కలిగిన వాళ్ళకళ! మాటలో నాజూకుతనం. చిన్నతిలకం బొట్టు!

సులోచనా ఆమె పెరట్లోకి వెళ్ళారు. ఆ రాత్రి అంది సులోచన.

"కాంతం భలే మనిషండి!"

"కాంతమా? ఎవరు?" అడిగాడు రాజశేఖరం

"మీదంతా చోద్యం! మనకి పనిలో కుదిరింది కదా! ఆమె"

"ఏది? ఎలాంటి మనిషి?"

"ఆమెను చూస్తోంటే పని మనిషి అనిపించదు అవునా?"

"కావచ్చు. పట్నం నాగరికత!"

"సిటీలో ఆమచూడని సినిమాలేదట!"

"ఆమెను చూస్తేనే ఆవిషయం అర్థమవుతుంది!"

"వెనకా ముందూ ఎవరూ లేరట! భర్త చనిపోతూ యిచ్చిన సొమ్ములతో నెట్టుకొస్తోందట!"

రాజశేఖరం నవ్వి ఊరుకున్నాడు.

మర్నాడే యూనివర్శిటీలో తనఉద్యోగానికి జాయినింగ్ రిపోర్ట్ యిచ్చాడు.

కొత్తలో బేబీ తనతల్లిని అంటిపెట్టుకుని వుండేది. క్రమంగా కాంతానికి చేరిక అయింది.

రోజులు గడిచేకొద్దీ బేబీకి కాంతంతో సన్నిహితత్వం పెరిగింది.

"కాంతం వచ్చాక నాకుపని సుఖమయింది." అన్నది సులోచన. రాజశేఖరం అప్పుడే వచ్చాడు, ఆమె మాటకు తలూపాడు. సులోచన అతడికి కాఫీ అందించింది.

రాజశేఖరం కాఫీ త్రాగుతూ పడక కుర్చీలో కూలబడ్డాడు.

"ఏమండీ? అలా వున్నారేం?"

"ఏమిలేదు సులోచనా? ఆఫీసు పని ఒత్తిడి!"

"పని ఎక్కువగా-వుందా?"




"పని తక్కువే! ఒత్తిడి ఎక్కువ."

"అదేమిటి?"

"సులోచనా! యూనివర్శిటీలో అంతా చదువుకున్న వాళ్ళే, మేధావులే! అయితే వాళ్ళ మేధస్సుకు కులం నకెట్లు!" రాజశేఖరం విచారంగా అన్నాడు

"కులం"-కులం మర్చిపోని చదువు లన్నమాట!"

"ప్చ్....విజ్ఞానానికి కులం! ప్రతిభకు కులం! ప్రమోషన్‌కి కులం! హెడ్‌షిప్‌కి కులం! ఈ కులం కుళ్ళుతో విద్యార్థుల బుర్రలు కుళ్ళుపట్టేస్తోన్నాయి పాపం! తరాలుపాతద్యే కుళ్ళు"

గుమ్మందగ్గర అలికిడయింది.

భార్యాభర్తలు తలలు త్రిప్పిచూశారు. బేబీ నీరసంగా లోపలకు వస్తోంది.

"బేబీ! ఏముందమ్మా?" అడిగాడు రాజశేఖరం.

సులోచన చటుక్కున లోపలకు పరుగెత్తింది పాలగ్లాసుతో తిరిగి వచ్చింది.

బేబీ మౌనంగా పాలు త్రాగింది తండ్రి ఒడిలో చేరబడింది. నిస్త్రాణగా కళ్లు మూసుకుంది.

"ఎప్పటినుండిఇలావుంది?" అడిగాడు రాజశేఖరం.

సులోచన నుదురు చిట్లించింది. "మధ్యాహ్నం ఆటకి బాగానే వెళ్ళింది" అంది.

బేబీ చిరుగుటాకులాగా వణుకుతోంది, చిరుచెమటలు పట్టాయి.

"బంతిలాగా ఉండేపిల్ల! సడన్‌గా బుగ్గలు పల్చబడ్డాయి." సులోచన గొంతు పూడుకుపోయింది.

రాజశేఖరం కూతురును మంచంమీద పడుకోబెట్టాడు.

మూడు ఇళ్ళకి అవతలగా లేడిడాక్టర్ వుంది, ఆమెను పిలుచుకు వచ్చాడు.

లేడీడాక్టర్ వచ్చేటప్పటికి బేబీ నిద్ర పోతోంది.

లేడీ డాక్టర్ పాపను పరీక్షించింది.

"జనరల్ వీక్‌నెస్. అంతే! పళ్ళు, ఆకు కూరలూ బాగా వాడండి. ఆకలికి మందు రాస్తాను." అంది లేడీ డాక్టర్.

"ఆకలి బాగానేవుందిడాక్టర్! వెర్రిగా తింటుంది" అన్నాడు రాజశేఖరం

లేడీ డాక్టర్ తలవూపి మందులు రాసింది.

బేబీ మర్నాటి ఉదయానికి తేరుకు కున్నది.

రాజశేఖరం నిశింతగా డిపార్ట్ మెంటుకు బయలు దేరాడు.

కాంతం మధ్యాహ్నం వరకూ బేబీ దగ్గరే వుండిపోయింది. సాయంకాలం రాజ శేఖరం వచ్చాడు.

బేబీని చూచి వె[రెత్తి పోయాడు. ఆమె చేతులకు వెం[టుకల [తాళ్లు కట్టి వున్నాయి. మెడలో తాయెత్తు. నుదుటను రూపాయి బిళ్ళలాంటి సింధూరం బొట్టు, బేబీ వరండాలో ఆడుకుంటోంది.

''సులోచనా? అరిచాడు రాజశేఖరం.

సులోచన కంగారుగా పరుగెత్తుకు వచ్చింది.

"బేబీకి యివన్నీ ఎవరు కట్టారు?"

"కాంతం!" అంది సులోచన తెల్ల బోయి.

''నాన్సెన్స్" రాజశేఖరం బేబీదగ్గర కూర్చున్నాడు. చేతులకూ మెడకూ వున్న తాళ్ళు విప్ప బోయాడు.

సులోచన అతడిని వారించ బోయింది.

''ఏమిటి, నీకూ ఈ మూఢ నమ్మ కాలున్నాయా?" రాజశేఖరం మొహం కందగడ్డలాగా అయింది.

"నాకు నమ్మకం లేదండి! కాని ఈ వెం[టుకల తాళ్లు వున్నంత మా[తాన నష్టంలేదు కదా!"

"అదో వెనులు బాటు! ఈ నమ్మ కాలకు [ప్రోత్సాహం!"

''ఏపుట్టలో ఏం పాముందో''

''నాన్సెన్స్! నావృత్తికే అపచారం! చెప్పేది సైన్సు! ఆచరణలో చాదస్తం!"

రాజశేఖరం చటుక్కున బ్లేడు అందు కున్నాడు. తాళ్లు కట్ చేశాడు. వాటిని ఉంగ చుట్టి [ప్రహారీమీద నుండి విసి రేశాడు.

''ఎంతపని చేశారు బాబుగారూ!''

రాజశేఖరం తలెత్తి చూశాడు.

గోడకి అవతల కాంతం. తాళ్లు అందు కుంది ఆమె,

"కాంతం! నువ్వేమిటో నీవనేమిటో అంతే! హద్దు మీరక!"

కాంతం తలవొంచు కుంది.

రెండువారాలలో బేబీ బాగుపడింది.

పూర్వంలాగా ఒళ్ళు చేసింది.

ం ం ం ం

రాజశేఖరం స్కూటర్ ఆపాడు.

ఉత్సాహంగా ఇంట్లోకి నడిచాడు.

సులోచన పడకగదిలో మంచంమీద వుంది. మంచం ఇవతల కాంతం నిలబడి వుంది. ఆమె బత్తాయి తొనలు ఒల్చు తోంది.

బేబీ సోఫాలో కూర్చుంది. బొమ్మలు చూసుకుంటోంది.

"సులోచనా! ఏమయింది?" అడి గాడు రాజశేఖరం.

సులోచన మౌనంగా రోదిస్తోంది.

కాంతం తొనలు అందిస్తోంది.

"బాబుగారూ! మీరుతొందరపడ్డారు" అంది కాంతం.

"తొందరా? ఏమిటి?" రాజశేఖరం వింతగాచూశాడు. కాంతం తనతో అదే రెండోసారి మాట్లాడటం!

ఈ ఇంట్లో ఏదో దుష్టశక్తివుంది.




పాపమీద కనిపించింది. చివరకు మీమీద పగ తీర్చుకుంది!"

"నాన్సెన్స్.... సినిమా డైలాగులు కట్టిపెట్టు. సులోచనా! చెప్పు! ఏమయింది?"

"ఎబార్షన్!"

"ఎబార్షనా? ఎలా? ఎందుకయింది? ఏం చేశావు?"

"ఏంచేస్తానండి? పాప బట్టలు ఉతుకుతోంటే...."

"కాంతం ఏమయింది?"

"ఆమె మ్యాట్నీకి వెళ్ళిందట."

"వచ్చేవరకూ ఆగలేకపోయావా?"

సులోచన మౌనంగా ఏడుస్తోంది.

రాజశేఖరం పెదిమలు బిగించాడు. ఆరోగ్యం బాగావున్న సులోచనకి గర్భస్రావం కావడం ఏమిటి?

దుష్టశక్తి ప్రభావమా? నిజంగా ఈ ఇంట్లో ఏదయినా దుష్టశక్తి వుందా?

సైన్సుకి ఈవాదస్తాంకి లంకె ఎక్కడ? లేకపోతే దేని దారిన అది తన వునికిని ప్రతిష్ఠించుకోవడమేనా? అటో పక్షమూ.....ఇటో పక్షమూ.... ఈ పోరాటం ఎంతకాలం? రాజశేఖరం తల విదిలించాడు.

"లేడీ డాకర్‌ను పిలుచుకురానా?" అడిగాడు రాజశేఖరం.

"ఇందాకనే వచ్చి వెళ్ళింది. ఇంజక్షన్ యిచ్చింది. మాత్రలు తెప్పించుకొమ్మంది. కాంతం తెచ్చి పెట్టింది."

కాంతం వంటచేసి పెట్టి వెళ్ళిపోయింది.

సులోచనకు ఆ రాత్రి రక్తస్రావం మొదలయింది.

లేడీ డాక్టర్‌కి రాత్రంతా సులోచన బెడ్ వద్దనే గడిచింది. రాజశేఖరం బేబీని నిద్ర పుచ్చి గదిబయట కూర్చున్నాడు. వాకిట్లో టప్‌మని శబ్దమయింది.

రాజశేఖరం వాకిట్లో లైటువేసి బయటకు నడచాడు.

వాకిట్లోపడి వున్న వస్తువును చూచి తెల్లబోయాడు.

నిమ్మకాయ. ఎర్రటి బొట్టుపెట్టివుంది, దాని మధ్యలో సన్నపాటి తీగగుచ్చివుంది, తీగకు రెండు ఎండు మిరపకాయలు తగిలించి వున్నాయి.

రాజశేఖరం గేటుదాటి పరుగెత్తాడు.

రోడ్డు నిర్మానుష్యంగా వుంది.

చీకట్లో ఎవరో నవ్వి నట్టుయింది, ఎక్కడో గాజుల గలగల! రాజశేఖరం తిరిగి యింట్లోకి వచ్చాడు.

సులోచన బాత్ రూంలో వుంది.

"బట్ట తడిసి పోతోంది!" అంది లేడీ డాక్టర్.

"కాంతాన్ని పిలిపించండి" అంది సులోచన నీరసంతో.

రాజశేఖరం స్కూటర్ తీశాడు.

ముందు చక్రం నిమ్మకాయను తొక్కింది.

స్కూటర్ రోడ్డెక్కింది.

కాంతం యింట్లోనే దొరికింది. ఆమెను యింటికి రమ్మని కబురు చెప్పి తిరిగి యింటికి వచ్చేశాడు.

"ఎందుకయినా మంచిది! మీవాళ్ళకు తెలియపరచండి!" అంది లేడీ డాక్టర్.

రాజశేఖరం పోస్టాఫీసుకు బయలు దేరాడు.

పెళ్ళిగ్రాంఇచ్చివచ్చేసరికి సులోచనను జనరల్ ఆస్పత్రికి తరలించారు. బేబీ ప్రక్కఇంటి వాళ్ళవద్ద నిద్రపోతోంది.

ప్రక్కింటి వాళ్ళకు కబురు చెప్పి సులోచనవెంట వెళ్ళింది కాంతం.

ఆసుపత్రిలో సులోచన కోమాలో వుంది.

రాజశేఖరానికి పిచ్చిగావుంది, మనసు పరిపరి విధాలా పోతోంది. దుష్టశక్తి వుండటం నిజమా? అవి తనమీద పగ బట్టేదా? తాను ఏం అపకారం చేశాడు. తాను దిగిన ఇంట్లో దుష్టశక్తి కాపురం వుందా? తాను కాపురంపెట్టి దానికి అపకారం చేశాడా?

రాజశేఖరం విసుగ్గా తలవిదిలించాడు

మన మనస్సు బలహీనమై వుంది. సులోచనకు కష్టంవచ్చింది. దానికితాను తట్టుకోలేకపోతున్నాడు. అందుకే మన సులో సైతాను తిష్టవేస్తున్నాడు.

నాన్సెన్స్....శనీలేదూ సైతాన్‌లేదూ.

రాజశేఖరం తన జుత్తులోకి వ్రేళ్ళు పోనిచ్చుకున్నాడు. తలను వ్రేళ్ళతో దువ్వుకున్నాడు.

గైనికాలజీ ఛీఫ్‌ను కలిశాడు.

ఆమెకు ముదువుకట్టి ప్రసన్నం చేసుకున్నాడు.

"రక్తం పోయింది. ఆమె గ్రూపు రక్తం దొరకాలి, బ్లడ్‌బాంక్‌లో అడిగి చూడండి?" అన్నది చీఫ్.

రాజశేఖరం అటు పరుగెత్తాడు.

"ఎబి" గ్రూపు రక్తం బ్యాంకులో లేదు.

రాజశేఖరానికి ఆసుపత్రి మీదా, ప్రభుత్వంమీదా మండుకొచ్చింది.

డబ్బుఖర్చుపెట్టగల తనకే యిన్ని ఇబ్బందులు ఎదురయితే బీదల గతి ఏమిటి? రక్తం వాళ్ళకు ఎక్కడదొరుకుతుంది?

ఉదయాన్నే రాజశేఖరం తండ్రీ సులోచన వాళ్ళ తల్లీ దిగారు.

రాజశేఖరానికి ఊపిరిసలిపినట్టయింది కొండంత అనరా దొరికినట్టయింది.

సులోచననూ బేబీ వాళ్ళనీ వాళ్ళకి వదిలిపెట్టాడు. తాను రక్తంకోసం వేట మొదలు పెట్టాడు.

ఎవరో అనుభవజ్ఞుడు చెప్పాడు దండు బజారులో ప్రహ్లాద మందిరం వెనక రక్తం అమ్ముతారని.




రాజశేఖరానికి అడ్రసు సులువుగానే దొరికింది.

రక్తం అమ్మే అతడు సంగతి విని పెదిమ విరిచాడు. రాజశేఖరం క్రుంగిపోయాడు.

తమ బంధువుల రక్తం తన రక్తం చెక్ చేయించాడు. సులోచనకి తమ ఎవరి రక్తమూ పడదు.

గైనకాలజీ ఛీఫ్ ఆపరేషన్ వాయిదా వేసింది.

సులోచన పరిస్థితి దిగ జారుతోంది.

సులోచనతల్లి జగదాంబ వంట గదిలోంచి బయటకు వచ్చింది.

"బేబీ!" పిలిచింది జగదాంబ.

బేబీ పలకలేదు.

జగదాంబ ఇంటిని వెతికింది. రోడ్డు మీదకూడా మనవరాలు కనిపించలేదు.

ప్రక్కయింటి వాళ్ళను బేబీ గురించి అడిగింది. వాళ్ళకూ ఏమీ తెలియదట.

జగదాంబ చక చక సర్దుకుని ఆస్పత్రికి బయల్దేరింది. బేబీ ఆసుపత్రిలో వుంది. కాంతం దగ్గర వుంది. నీరసంగా కాంతం భుజం మీద తలవాల్చింది.

జగదాంబ మనసు మనసులో లేదు. బేబీకి ఏమయింది?

అప్పుడే వచ్చిన రాజశేఖరానికి బేబీ గురించి చెప్పింది. రాజశేఖరం కళ్ళు చెమర్చాయి.

బేబీ మరల చిక్కిపోయింది. మొహం కళ తప్పింది. ఎందుకు జరుగుతోంది? ఎలా జరుగుతోంది?

రాజశేఖరం కూతురును ఆసుపత్రిలో చూపించాడు జనరల్ వీక్‌నెస్!

రాజశేఖరానికి దు:ఖం ముంచుకు వస్తోంది.

ఉదయం బంతిలాగా వున్న బేబీకి జనరల్ వీక్‌నెస్ ఏమిటి?

వైద్య శాస్త్రం యింత పనికి మాలినదా?

రాజశేఖరం తల పట్టుకున్నాడు.

ఒకవైపు తన భార్యా రెండోవైపు తన కూతురూ.

తన బతుకు ఏంకానున్నది?

"బాబుగారూ!"

తలెత్తిచూశాడు. కాంతం!

"ఏంకావాలి?" అడిగాడు రాజశేఖరం.

"రక్తంకోసం వెళ్ళరా?" అడిగింది కాంతం.

నిరాశగా తలూపాడు రాజశేఖరం.

"ఎన్ని సీసాలు కావాలి?"

"కనీసం రెండు సీసాలు!"

"వెయ్యి రూపాయలు ఇవ్వండి!"

"నువు తీసుకువస్తావా?"

"అవును"

"ఎక్కడ నుండి?"

"ఆ విషయం నన్నడక్కండి!"

రాజశేఖరం జేబులోంచి వెయ్యిరూపాయలు అందించాడు.

కాంతం వెళ్ళిపోయింది.

మంచంమీద బేబి కలవరిస్తోంది.

'కాంతం!వద్దు! సూది!" బేబి చిగురు టాకులాగా వణుకుతోంది.

రాజశేఖరం చప్పున బేబీవద్ద కూర్చున్నాడు

"బేబి! ఏమిటమ్మా?" బుజ్జగించాడు రాజశేఖరం.

"నాన్నా! సూది! అబ్బ!" ఇంకా కలవరిస్తోంది బేబి

"ఎక్కడమ్మా?"

బేబి అనంకల్పితంగా ఎడంచేతి మీద కుడిచెయ్యి రాసింది.

రాజశేఖరం ఆమె వ్రేలివద్దచూశాడు.

ఎడంచేతి మడంవద్ద ఎర్రటి రక్తం బొట్టు!

రాజశేఖరం నుదురు చిట్లించాడు. ఆలోచనల కొనలు అందుతోన్నాయి.

రక్తం బొట్టును గాజువలకమీదకు తీశాడు.

రక్త పరీక్షకు ఇచ్చాడు.

పాప రక్తం 'ఏబి' గ్రూపు.

తల్లిరక్తం గ్రూపు. ఇద్దరిదీ పోజిటివ్! స్కూటర్ ఎక్కాడు. దండుబజారు ఇవతల స్కూటర్ఆపాడు. కాంతం ప్లాస్టిక్ బుట్టతో నడచివస్తోంది.

ప్లాస్టిక్ బుట్టలో రెండు సీసాలు కనిపిస్తున్నాయి.

రాజశేఖరం ఆమెను దగ్గరకురానిచ్చి బుట్ట లాక్కున్నాడు.

కాంతం తెల్లబోయింది.

"ఎంతకాలంనుండి ఈ వ్యాపారం?" రాజశేఖరం నిగ్రహించుకుంటున్నాడు. అయినప్పటికీ కోపం పెదిమలు చివర వంకరలు తిరుగుతోంది.

"బాబుగారూ ఏమిటి మీరనేది?"

"నా బేబి రక్తం మార్కెట్లో అమ్ముతోన్నావు. నా బేబి నీకు ఏం అపకారం చేసింది?"

కాంతం మాట్లాడలేదు.

"దుష్టశక్తివున్నట్టు నన్ను నమ్మించి ప్రక్కదారి పట్టించబోయావు. నీకు మేం చేసిన అపకారం ఏమిటి?"

"బాబుగారూ ..."

"నిన్ను నేను ఇప్పుడే చంపగలను. కాని విడిచిపెడతాను. ఎందుకోతెలుసా?"

కాంతం పమిట చెంగుతో నోటికి అడ్డం పెట్టుకుంది.

"నా చేతులతో నేను నా కూతురి రక్తం నా భార్యకు ఎక్కించనివ్వను. నువు ఆ పిల్లరక్తం వ్యాపార వస్తువు చేశావు. వెయ్యిరూపాయిలకు ఈరక్తాన్ని కొన్నాను. అంతేకాదు. మనుషుల మెదళ్ళలో ఎలాంటి దుష్టశక్తులుంటాయో నువ్వు తెలియచెప్పావు. అందుకే.......

అందుకే.... రాజశేఖరం వెనక్కి తిరిగాడు. అతడి కంఠం రుద్ధమయింది.

కాంతం ఏడుస్తోంది.

చటుక్కున వంగి అతడికాళ్ళు పట్టుకుంది ★



# కుడివడముల దగా.....దగా

ఖానూరు గంగాధర రెడ్డి



సూరీడు కాబూలీ వాలా వడ్డీలా చక చకా పైకి రాసాగేడు. ఇంకా దున్న వలసిన రెండుకొండ్రలూ తొందరగా అవజేసి పొద్దు నడినెత్తి కొచ్చేసరికి ఎడ్లను వదలి వక్కనే వున్న వేపచెట్టునుండి పుల్ల విరుచుకుని తోము కుంటూ యి ం టి దా రి పట్టాడు రాఘవయ్య.

ఇంటికొచ్చి ఎడ్లను చావిట్లో కట్టేసి మేతవేసి, నూతి దగ్గరకెళ్ళి ముఖం కడుక్కుని "ఏంకూర చేశావే వెంకటలక్ష్మి!

కడుపు కాలి పోతోంది త్వరగా తీసుకురా" అంటూ పీటవాల్చి కూర్చున్నాడు.

రాఘవయ్య రెండు ముద్దలు తిని మూడో ముద్ద నోట్లో పెట్టుకోబోతున్నాడు.

'రాఘవయ్యగోరూ! రాఘవయ్యగోరూ! రచ్చబంత కాడికి మున్సబుగోరూ 'ఆరై గోరూ!' 'తాసిల్దారుగోరూ' వచ్చింర్రు. మీరు తాసీలు కట్టలేదంట గదా. ఎంటనే మిమ్మల్నదకు తీస్కు రమ్మన్నారండి" అంటూ కేకవేశాడు బయటనుంచి ఆవూరి మోతాదు.

"ఏంతాసీలు ఏట్రా! నేనెప్పుడో కట్టినాను గదరా" ఉప్పుచేప నంజుకుంటూ లోపలనుంచే జవాబు చెప్పాడు!

"మీరు గడితే మున్సబుగోరి కేటండి మళ్ళీకట్టమని చెప్పటానికి ఆరికి మీరంటే ఏంటి కోపముంటాది! రండి రండి అవ నూనుకుందురుగాని" అంటూ తొందర బెట్టాడు మోతాదు మల్లిగాడు.

"వెళ్ళి రారాదా! ఆడు యిప్పటికే మూడుసార్లొచ్చి ఎల్లాడు" అంది వెంకటలక్ష్మి

"వీళ్ళందరికీ ఏరేపని లేనట్టుంది. తాసీలు కట్టినా కట్టలేదని బుకాయించడము అలవాటయి పోయింది యీ మున్సబుకి" అంటూ లేచి చుట్ట ముట్టించుకుని బయల్దేరాడు రాఘవయ్య.

"ఏం రాఘవయ్యా! ఇంటికో మోతాదును కాపలా పెట్టుకోమంటావా యేంటి? ఎన్నిసార్లు పంపాలయ్యా నీకోసం మోతాదును" వ్యంగ్యంగా అన్నాడు మునసబు.

"నేనేదున్నానయ్యా ఇంటికాడ. అరక్కిపోయి ఇప్పుడేగదా వచ్చింది" అన్నాడు రాఘవయ్య.

"కబుర్లు కాకరగాయలూ తర్వాత గాని ముందు డబ్బు కట్టించుకుని రసీదు ఇవ్వవయ్యా" ఆరై మధ్యలో కల్పించుకుని మన్సబు నద్దేశించి అన్నాడు.

"ఇంకా నీ తాసీలు బాకి మూడొందలుందయ్యా! డబ్బియ్యి, రసీదు ఇస్తా" అన్నాడు మున్సబు రాఘవయ్యతో.

"తాసీలు బాకి ఏందయ్యో! మొత్తం డబ్బులు తీసుకుని ఇక ఈ సంవత్సరానికి కట్టేపని లేదని చెప్పినావుగదా?" చుట్ట అవతల పారేస్తూ కాస్త కరుగ్గా అన్నాడు రాఘవయ్య.

"చాలు చాల్లే త్వరగా డబ్బుతియ్యి. అవతల ఆలస్యం అయిపోతోంది" కసురుకున్నాడు మన్సబు.

ప్రక్కనున్న తాసిల్దారు గుళ్లో దేవుడిబొమ్మలా చూస్తూ కూర్చున్నాడు.

చుట్టూవున్న తోటి రైతులు శవాన్ని తగలెయ్యడానికి శ్మశానానికి వచ్చిన వాళ్ళలా నిశ్శబ్దంగా నిలబడి వున్నారు.

"ఏటయ్యా నువ్వనేది! నేను డబ్బు కట్టానని ఎన్నిసార్లు చెప్పాలేంటి?" విసురుగా అన్నాడు రాఘవయ్య.

"అయితే నువ్వు కట్టిన డబ్బుకి రసీదులు తీసుకురావయ్యా" అన్నాడు 'ఆర్. ఐ.' కల్పించుకుని.

"ఆ కాయితాలు నాకేటి తెలుత్తాయి. నేనేమన్నా సదువుకున్నోణ్ణా యేటి" అన్నాడు రాఘవయ్య మధ్యాన్నపు సూరీడిలా మండిపడుతూ.

"కోపమెందుకు లేవయ్యా! మా మోతాదును వెంటబెట్టుకెళ్లు వాడు చూపిస్తాడు కాయితాలు" అన్నాడు మన్సబు.




"వదవయ్యాబాబు! ఇప్పటికే ఆలిసె మయిపోతాంది" అంటూ మల్లిగాడు రాఘవయ్య ననుసరించాడు.

రాఘవయ్య చూపించిన కాగితాలకట్ట లోంచి మల్లిగాడు రెండు కాగితాలు తీశాడు. ఆ రెండు కాగితాలు తీసుకుని రాఘవయ్య రచ్చబండదగ్గర కొచ్చాడు.

"ఇవే బాబూ ఆ రసీదులు! నాదగ్గర డబ్బులు తీసుకుని మున్సబు ఇచ్చినవి" అంటూ ఆరై చేతిలో పెట్టాడు రాఘవయ్య;

"ఇవి పోయిన సంవత్సరం కట్టినవి గదయ్యా"అంటూ ఆ కాగితాలు మున్సబుకు అందించాడు ఆరై.

"అవునండి ఇది పోయిన సంవత్సరానివి" అన్నాడు మున్సబు వాటినిచూసి.

"ఏంటయ్యోయ్! ఈసంవత్సరానికని గాదా నువ్వు ఇచ్చింది" అంటూ మున్సబును రెట్టించాడు రాఘవయ్య.

"అట్లాగని నేనేం చెప్పలేదు. ఇక నువ్వెన్ని చెప్పినా-యీ సంవత్సరానికి నువ్వు కట్టవలసిందే" అన్నాడు మున్సబు

"అదేం కుదరదయ్యో నువ్వు యీ సంవత్సరానికనే తీసుకున్నావ్"

"కాదు"

"అవును"

"ఆగండి" కోడెదూడ రంకెలావుంది తాసిల్దారు కేక.

"ఏమయ్యా! నువ్వేమో తాసీలు కట్టాను అంటావు. మీ మునసబేమో కట్టలేదూ అంటాడు. నువ్వు కట్టావనడానికి సాక్ష్యంగా రసీదులా నీదగ్గర లేవు ఏం చెయ్యాలో నువ్వే చెప్పు" అన్నాడు తాసిల్దారు.

"సత్తె సెమాణకంగా నల్గురూ నడిచే దారిలో నిలబడి చెబుతున్నా. నేనా డబ్బు కట్టేశాను బాబు, ముత్తాలమ్మ తోడు" అన్నాడు రాఘవయ్య.

"ఈ ఒట్లూ, వల్లకాళ్ళూ నాదగ్గర

చెల్లవు" తాసిల్దారు గొంతులో చిరాకు. "నీకు యింకా రెండు గంటల టైము యిస్తున్నా. ఈలోపల నీవు డబ్బు లేక పోయావో నీఎడ్లరెండింటినీ జప్తుచేస్తాను" (నాకసలే జప్తులు చెయ్యడం సిగరెట్ తో పెట్టిన విద్య) అంటూ తాపీగా సిగరెట్ వెలిగించు కున్నాడు.

"పద. పద. పెద్దోళ్ళతో వ్యవహారం. కొరివితో ఎందుకు తల గోక్కోవడం" అంటూ రాఘవయ్యను అవతలకు తీసు కెళ్ళి గుస గుసలాడాడు మోతాదు.

o o o

అప్పుడు సమయం మధ్యాహ్నం ఒంటిగంట. ఎండ మండపోతోంది రాఘవయ్యలా! రైతుల గొంతుల మీద తాసిల్దారు కూర్చున్నట్లు సూర్యుడు దేశం నడి నెత్తి మీద తిష్ఠ వేశాడు. రాఘవయ్య వడి వడిగా నడుచుకుంటూ వెళ్ళి

"సావుకారుగోరూ! సావుకారుగోరు" చలమయ్య తలుపు తట్టి పిలిచాడు రాఘవయ్య.

"ఎవురబ్బా! ఇంత ఎండేళప్పుడు! వచ్చి వచ్చి" అంటూ తలుపు తీశాడు చలమయ్య విసన కర్రతో పొట్ట మీద విసురు కుంటూ.

"ఓ-రాఘవయ్య-నీకు నూరేళ్ళాయు వయ్యా! ఇప్పుడే నీసంగతి అనుకుంటు న్నాం. నువ్వే వచ్చావ్" పొట్ట నిమురు కుంటూ అన్నాడు చలమయ్య.

"పెద్దోళ్లు మీరు. నా బోటోళ్ళ నెందుకు తలుస్తారు లెండి. మాతో మీకేం పనీ-మాబోటోళ్ళకు మీతో పనిగాని" అంటూ పక్కనున్న అరుగు మీద ,చతి కిల బడ్డాడు రాఘవయ్య.

"నువ్వు క్రిందటేడు ఆవకాయ పెట్టుకోను కాయలు పంపావు గదా ఈ సంవత్సరం కూడా ఓ రెండొందలిస్తే నీ పేరు మీదుగా వచ్చేది పెట్టుకుంటాము: ఆ సంగతి అనుకుంటున్నాము" అన్నాడు చలమయ్య.

"అట్టాగే పంపిస్తాన్లే. సాయంత్రం నీతో అర్జంటు పనొచ్చి పడిందయ్యా"

"ఏముంటుంది, డబ్బులు పనేగా. ఎంత కావాలేంటి?" అన్నాడు చలమయ్య

"ఆ మన్సుబుగోడు తాసీలు కింద మూడొందలూ కట్టించుకుని ఇప్పుడు కట్టలేదంటున్నాడు దొంగతొత్తుకొడుకు. మరలా మూడొందలూ కట్టాల్సొచ్చింది మరి అంతవరకూ ఇప్పించండి" అన్నాడు రాఘవయ్య.

- "అట్టాగే తీస్కోందువులే" అని, "ఒరేయ్ పెద్దోడా మీ చినబావ శ్రీరాముల్ని ఇటు రమ్మన్రా" అంటూ ఇంటోకి కేకేశాడు చలమయ్య.

అంటే శ్రీరాములు అని పిలవబడే వ్యక్తి ఏవో కొన్ని కాగితాలు పట్టుకుని పెళ్ళిద్దరి దగ్గరకూ వచ్చాడు.

"ఈయన మా చిట్టిదాని మొగుడు శ్రీరాములు. ఏదో ఇన్సూరెన్సు ఏజెంట్ గా చేస్తున్నాడు" అంటూ సదరు శ్రీరాముల్ని పరిచయం చేశాడు చలమయ్య.

"అంటే ఏంటంటే" అన్నాడు రాఘవయ్య.

"అంటే జీవిత భీమా" అన్నాడు శ్రీరాములు.

"అంటే!" అన్నాడు రాఘవయ్య

ఆశ్చర్యంగా.

"అంటే మన కోపరేటివ్ బ్యాంక్‌కి కట్టినట్లు సంవత్సరానికి ఇంతని ఇరవై సంవత్సరాలు కడితే - తర్వాత మనం కట్టినదానికి రెట్టింపు వస్తుందంటా, ఒక వేళ దేవుడు తిన్నగా చూడక మనకు ఏదన్నా అయితే మనం మొదట అనుకున్నంతా ఇచ్చేస్తారంట!" అన్నాడు చలమయ్య.

"మామయ్యా! ఈయనతో సంవత్సరానికి వెయ్యిరూపాయలు కట్టి చొచ్చును కుంటాను" అన్నాడు శ్రీరాములు రాఘవయ్యవంక చూస్తూ చలమయ్యతో.

"నాకెందుకులెండి-మట్టి పిసుక్కునే వాడికి ఈ తిరకానులన్నీ" అన్నాడు రాఘవయ్య.

"కానులు పోగేసుకోమంటే తిరకానులంటావేంటయ్యా'' అంటూ రూపాయి బిళ్ళలు డబ్బాలో వేసి గలకరించినట్లుగా నవ్వాడు చలమయ్య.

"నాదగ్గర సొమ్ము లేదండి. అదిలేకనే గదా మీకాడకొచ్చింద ఇప్పుడు''

"డబ్బు వేముందయ్యా! మడిని దగ్గర దగాలేకుండా వుండాలిగాని ! అదీ ఇదీ మొత్తం ఎనిమిదొందలు నేనిస్తా నోటు రాసి తీసుకెళ్లు'' అంటూ మొహమాటం లాంటి బలవంతంచేశాడు రాఘవయ్యను చలమయ్య.

"తప్పదంటారా" రాఘవయ్య గొంతులో నీరసం ధ్వనించింది-లేకుంటే ఈ మూడొందలుకూడా ఇవ్వడేమోననే అనుమానం.

"ఏదో చిన్నల్లుడు - నీదే బోణీ. నీతోనే వ్యాపారం ప్రారంభం కానియ్యవయ్యా!" అంటూ అల్లుడికి కన్నుగీటాడు చలమయ్య.

మూడొందలు రాఘవయ్య చేతిలోకి రు.500లు ఎల్. ఐ. సి. కాగితాలు శ్రీరాములు సూట్‌కేసులోకి ప్రామిసరీ నోటు చలమయ్య బీరువాలోకి సర్దుకున్నాయి.

ఈ మూడొందలకూ రసీదిస్తూ తనకు యిలా ఎవరెవరి దగ్గర ఎన్ని వందలు మిగిలాయో లెక్కలు వేసుకో సాగాడు మున్సబు మనసులో.

ం ం ం

వర్షాకాలం మొదలయింది. ఆకుమళ్లు ఏపుగా పెరుగుతున్నాయి. రాఘవయ్య మరికొందరు రైతులు కలిసి కో-ఆపరేటివ్ బాంక్ ప్రసిడెంట్‌నుకలిసి "ఊడ్పుల సీజను వచ్చిందిగదా? మరి మాకేమయినా అప్పులిప్పిస్తారా" అని అడిగాడు.

"ఈ బాంక్ మీ కోసమే గదయ్యా వుంది! రండి! రండి! తప్పకుండా యిస్తాం" అంటూ వాళ్ళను లోపలకు పిలిచి గుమస్తాను ప్రక్కకు పిలిచి ఏదో గుసగుసలాడేడు.

గుమస్తా కావలసిన చోట్లల్లా వేలిముద్రలు వేయించుకుని వచ్చినవాళ్లుగురికి తలకో ఐదువందల రూపాయి లిచ్చాడు.

ఎరువులూ అవీ కొని వ్యవసాయపు పనుల్లో పడ్డారు రైతులంతా.

ం ం ం

అక్టోబరు సెంబరు నెల సాయంకాలం. తన

మిరప తోటలో తిరుగుతున్న రాఘవయ్యకు అక్కడక్కడా ఏదో పురుగులు కన్పించాయి

"ఓర్నీ! ఈ పురుగులు కూడా మున్నటు గాడిలాగా తెగబలిసి పోతున్నాయి వీటి అంతు చూడాల. పట్నం బోయి రేపు మందులు తేవాల" అనుకున్నాడు రాఘవయ్య,

తెల్లారిన తర్వాత పక్కనున్నపట్నం పోయి తన వూరి వి.ఎల్. డబ్ల్యు రాసిచ్చిన కాగితం మందుల కొట్టువాడి కిచ్చి మూడు వందల రూపాయిలు విలువైన మందులు తీసుకుని యింటిదారి పట్టాడు.

○ ○ ○

మందు చల్లి మూడు రోజులయినా-పురుగులు చావకపోగా రోజు రోజుకు పెరగడం చూసి మందుల కొట్టువాణ్ని తిట్టుకుంటూ బజార్నపడ్డాడు రాఘవయ్య ఇంటి కొచ్చేసరికి "కోపరేటివ్ బాంక్ గుమాస్తా యిచ్చాడండీ' అంటూ రాఘవయ్య భార్య ఓ కాగితం అందించింది. ఆకాగితం తీసుకెళ్ళి ఆ వూరి స్కూల్లోని మాష్టారు చేత చదివించుకున్నాడు రాఘవయ్య.

"మీరు తీసుకున్న వెయ్యి రూపాయిలూ వడ్డీతో సహా జనవరి నెలాఖరుకు చెల్లించాలి అని నోటీసండి" అని అన్నాడు మాస్టారు. ఇంతలో యిద్దరు ముగ్గురు రైతులు అదేలాటి కాగితాలు తీసుకుని మాస్టారి దగ్గరికి వచ్చారు. వాళ్ళవి యిలాంటి నోటీసులే!

అది విన్న రైతులు 'మోసం!' 'దగా!' అని అరుచుకుంటూ ప్రెసిడెంట్ యింటి వైపుగా సాగారు ఆవేశంగా.

"డబ్బు తీసుకునేటప్పుడు 'ప్రెసిడెంట్ మామా' 'ప్రెసిడెంట్ బావా' అంటూ తిరిగి తిరిగి తీసుకుంటారుడబ్బు. మీరలా తిరిగి కట్టాలంటే కళ్ళవెంట నీళ్లు పడతాయి. మీ బుద్ధులే ఇంతరా" అన్నాడు ప్రెసిడెంట్ రౌద్రంగా!

"అయితే మాకు అయిదొందలప్పిచ్చి వెయ్యిరూపాయలు కట్టమని కాగితాలు పంపడం నీకు న్యాయంగా వుందా?"

"దీనిలో న్యాయం అన్యాయం ఏముందిరా? డబ్బు తీసుకున్నట్లు మీరు వేలి ముద్ర వేశారు - ఒకరి కొకళ్ళు జామీన్లు వున్నారుగదా! లేనిపోని అబద్ధాలు చెప్పకుండా డబ్బులుకట్టెయ్యండి" అన్నాడు ప్రెసిడెంట్.

"దగా...దగా....మోసం....మోసం" కోపంతో రుద్రతాండవం చేయసాగాడు రాఘవయ్య!

"అన్యాయం......అన్యాయం........ అక్రమం....అక్రమం" గట్టిగా అరిచాడు రంగయ్య!

"తడి గుడ్డలలో గొంతులు కోయటం అంటే ఇదే" అన్నాడు వెంకయ్య!

"ఆ అలవాట్లన్నీ మీవిరా! అలా చేసేది మీరా! అయినా మీతోనాకేమిటి? రేపు పోలీసులు వస్తారు! అప్పుడు చూద్దురుగాని" అంటూ గభాలున తలుపులు మూసుకున్నాడు ప్రెసిడెంట్!

దగాపడ్డ రైతన్నల ఆవేశంలో.... ఆవేదనలో....ఎదురు తిరుగుతున్నాయి గుండెలు!!









కాని మీరు వదిలించుకోవల్సింది ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండు అయితే మీకు కావల్సిన షాంపూ, క్లినిక్‌ని మించినదై. ఉండాలి మరి

# క్లినిక్ స్పెషల్

క్లినిక్ మీ చుండుపై పనిచేసిందని, మీకు సరిగా సరిపడిందని మాకు తెలుసు. అయితే ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుగల వారున్నారన్న సంగతీ మాకు తెలుసు.

అందుకే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండును తొలగించేందుకు కొత్త సూత్రీకరణను ప్రవేశపెట్టాం. క్లినిక్ మించినదది...దాని పేరు క్లినిక్ స్పెషల్. ఆ! ఇప్పుడు రెండు క్లినిక్ షాంపూలు ఉన్నాయి. మామూలు చుండుకు క్లినిక్... ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుకు క్లినిక్ స్పెషల్. ఇక ఈ రెండింటి కలయిక చుండు సమస్యలన్నింటికీ నివారణే మరి.

**హిందుస్తాన్ లివిలెడ్ వారి విశిష్ట ఉత్పాదన**



జయకృష్ణ సమర్పించు   కృష్ణ నటించిన

చిత్రకల్పన ఫిలింస్

# కృష్ణావతారం

బాపు

"బొంగరం గిర్రున తిరుగుతా వున్నా
అది కదలకుండా నించున్నట్టే
కనిపిస్తా వుంటది కదా- మనవూఁ
అంతే - ముసుగు దన్ని బజ్జున్నా
మేలుకునే వుంటాం "

-ఇది కృష్ణావతారంలో కృష్ణావతార తత్వం.

ఈ చిత్రంలో కథానాయకుడి పేరు కృష్ణావతారం-అతనికో సొంత ఫిలాసఫీ వుంది.

ఈ ప్రపంచంలో మంచీ - చెడూ అంతా దేవుడే చూసుకుంటాడని మనం కళ్ళు మూసుకు కూర్చోకూడదంటాడు.



అదీగాక దేవుడు చాలా లేటుగాగాని కార్యరంగంలోకి దూకడని కృష్ణావతారం తరుచు బాధపడిపోతూ తనే కార్యరంగంలోకి దూకి, ఆ తర్వాత చట్టరీత్యా జైలుకి వెళ్ళిపోతుంటాడు

"సంభవామి యుగే యుగే" అంటే యీ రాకెట్ యుగంలో చెల్లదంటాడు.

అందుకే మన కృష్ణావతారం "సంభవామి గంటే గంటే" అంటాడు

కృష్ణావతారానికి జీవితంలో కొన్ని కోరికలతోపాటు కొన్ని బాధ్యతలూ వున్నాయి. వేటినీ మర్చిపోకుండా ఓ అవతార పురుషుడిలాగే కథ నడిపిస్తాడు.

సంక్షిప్తంగా కథ ఏంటంటే !

అది ఒక పెద్ద బంగళా చాలా పెద్ది బంగళా అంత పెద్ద బంగళాముందు చిన్నకారు వచ్చి ఆగితే ఏనుగు ముందు కుందేలు నిలబడ్డట్టుంది

కారులోంచి కృష్ణావతారం శ్రీధర్ దిగారు శ్రీధర్ ఆ బంగళావారి పెద్దల్లుడు వృత్తిరీత్యా లాయరు కారు దిగి భవంతిని కలయచూశాడు కృష్ణావతారం "పెద్ద కొంపే " ఆశ్చర్యపోతూ



అన్నాడు కృష్ణ

"లోపలికి నడు" అన్నాడు శ్రీధర్

"ఈకొంపలో జనాభా ఏమాత్రమో?" సందేహంగా అడిగాడు కృష్ణ

"నలుగురైదుగురుంటారు" శ్రీధర్ జవాబు

ఓ క్షణం కృష్ణ ఆశ్చర్యపోయాడు

వార్నీ! ఇంత పెద్ద బంగళాలో నలుగురా? కడుపు లొచ్చాయంటే మరి రావూ?"

కృష్ణ మాటల్ని వారించి, లోపలికి నడిపించాడు శ్రీధర్

**అసలు కథ ఏంటంటే ?**

ఆ బంగళా జగన్నాథం అనే ఓ పెద్ద మనిషిది ఆయనకి కొంతకమణిలాంటి వ్యాపార సంస్థలున్నాయి ఇద్దరు అమ్మాయిలూ ఓ సుపుత్రుడూ వున్నారు సుపుత్రుడు పేరుకి గోపాలకృష్ణుడేగాని నిజానికి పాపాలకృష్ణుడు పెద్దమ్మాయి మొగుడు శ్రీధర్ ఇంటి వ్యవహారాలు సంస్థల లిటిగేషన్ వ్యవహారాలూ ఆయనే చూస్తాడు లీగల్ బుర్ర వుపయోగించి సలహాలు యిస్తుంటాడు ఇంకో అమ్మాయి కాంతి ఆ అమ్మాయికి పెళ్ళి కాలేదు కాని పాపం! తల్లి కాబోతోంది ఇది యిట్లా వుండగా జగన్నాథానికి యజమాని లాంటివాడు, గురువులాంటివాడు ఒకడు సింగపూర్‌లో వున్నాడు మొన్నామధ్య జగన్నాథం సింగపూర్ బిజినెస్ పనిమీద వెళ్ళినప్పుడు ఆ సింగపూర్ పెద్దమనిషి



కొడుక్కి తన కూతుర్ని యివ్వడం ఖాయం అనేశాడు తీరా జగన్నాథం విమానం దిగేసరికి కూతురికి నెల తప్పిందని తెలిసింది ఆవేశపడ్డాడు-ఆక్రోశపడ్డాడు - శాంతిని తిట్టాడు కొట్టాడు-చంపేస్తానన్నాడు

ఎవరో చెప్పమని తల్లితండ్రి అడిఅడిగారు

శాంతి మూగనోము పట్టింది

ఇంటి పెద్దల్లుడు అన్ని సమస్యలకు సలహాదారుడు అయిన శ్రీధర్‌ని తెలుసుకోమన్నారు

ఉహూఁ ఆ పిల్ల పెదవి విప్పలేదు

ఈ బాధ యిలా వుండగా ఆ సింగపూర్ పెద్దమనిషి నిశ్చయ తాంబూలాలు తీసుకోడానికి ఇండియా వచ్చేశాడు-ఇంట్లో అడుగు పెట్టాడు

ఏం చెయ్యాలో, ఆ పెద్దమనిషికి ఏం చెప్పాలో అర్థం కాలేదు జగన్నాథానికి

పిల్ల కాలేజీలో ఎవర్నో ప్రేమించిందనీ, తను వచ్చేలోగా రిజిష్టర్ పెళ్ళి చేసేసుకుందనీ అబద్ధం చెప్పేశాడు జగన్నాథం

అయిందేదో అయింది - వెరీగుడ్-కొత్తదంపతుల్ని చూసి అక్షింతలు వేసి వెళ్తానన్నాడు ఆ సింగపూర్ పెద్దమనిషి

జగన్నాథానికి చెమటలు పట్టాయి బుర్ర పనిచెయ్యడం మానేసింది అర్జంటుగా పెద్దల్లుడు తన బుర్ర పనిచేయించడం ప్రారంభించాడు

"సాయంత్రానికి కల్లా ఓ అల్లుణ్ణి తెద్దాం-ఓ గంట నాటకమేకదా-నాకు వదిలెయ్యండి" అన్నాడు

'హమ్మయ్య' అనుకుని 'సరే' అన్నాడు జగన్నాథం

తరచుగా కోర్టులో తగిలే కృష్ణావతారం స్ఫురించాడు శ్రీధర్‌కి అప్పుడే



జైలునుంచి విడుదల అయిన కృష్ణావతారాన్ని సరాసరి చిన్నల్లుడి హోదాతో ఇంటికి తెచ్చాడు.

కృష్ణావతారం అంటే శ్రీధర్‌కి మంచి అభిప్రాయం వుంది. పాపం! చాలా తరచుగా జైలుకి వెళ్తుంటాడుకాని చెడ్డపనులు చేసి వెళ్ళడు. పోలీసులు చెయ్యాల్సిన పనులు తనే చేసేస్తుంటాడు. అందుకని పోలీసులు జైలుకి అప్పగిస్తుంటారు.

దుష్టశిక్షణ శిష్టరక్షణ తనే చేసేస్తుంటాడు. అంతకుమించి కృష్ణావతారానికి చేసే నేరాలు ఏమీ లేవు.

ఇలా కిరాయి అల్లుడుగా బంగళాలో అడుగుపెట్టాడు కృష్ణ.

సింగపూర్ పెద్దమనిషి దీవించడం వెళ్ళిపోవడం పూర్తయింది. జగన్నాథానికి ఓ గండం గడిచింది.

కాని కృష్ణావతారం నాటకం పూర్తయినా బంగళా వదిలి వెళ్ళనని మోకీ వేశాడు.

అర్థం పర్థం తెలీని ఆ పిల్లని అన్యాయం చేసింది ఎవరో తెలుసుకోనిదే బయటికి వెళ్ళనన్నాడు.

ఆత్మహత్యకి సిద్ధమైన శాంతిని కాపాడి, ధైర్యం చెప్పాడు. మనసున్న మనిషిగా నీకు ఏ ఆపదా రాకుండా చూసుకుంటానన్నాడు.

ఇంతలో మొదట్నుంచీ కృష్ణావతారం మీదే మనసూ, ప్రాణం పెట్టుకున్న గౌరి రంగంలోకి వచ్చింది. బంగళా వదిలి బయటికి రమ్మంది.



కృష్ణావతారం వచ్చిన పని అయితే గాని రానన్నాడు గౌరి నోరు చేసుకుంది కోపంగా వెళ్ళిపోయింది

ఆ బంగళాలో ఒక్క శాంతి తప్ప మిగతావారంతా కృష్ణావతారానికి వగ వాళ్లే-శాంతి తల్లికి కృష్ణావతారం అంటే అభిమానం

శాంతికోసం ఎన్నో అవమానాలు, మాటలూ-చివరికి గాయాలు కూడా భరించాడు కృష్ణ కృష్ణావతారానికి ముచ్చెం మూడు ఆశలున్నాయి అవి-"నంబర్ టి వన్ను ఏర్కండిషన్ రూములో మూడు నిద్దర్లు చెయ్యటం, ఏరోప్లేనెక్కి సౌవకుండా నేచీగా దిగటం-వచర్లో వున్న పార్టీ ఎమ్మెల్లేగా మూణ్ణాళ్ళు ఆవరం చెయ్యటం" ఇవన్నీ కోరికలు - పోతే కృష్ణావతారానికి ఒకే ఒక దుగ్టివుంది అది చెల్లాయి పెళ్ళి

అసలు చెల్లాయి పెళ్ళిగురించే యీ కిరాయి అల్లుడు నాటకానికి ఒప్పుకున్నాడు అల్లుడుగా కాసేపు నటిస్తే పదిలేలు యిప్పిస్తానని శ్రీధర్ ఆశ పెట్టాడు ఆ డబ్బుతో చెల్లాయి పెళ్ళి చేద్దామని కృష్ణావతారం ఐడియా-తీరా వచ్చాక కథ మరోలా నడిచింది - ఎలా నడిచిందో, కృష్ణ కృష్ణావతారంగా ఎలా నడిపించాడో సినిమా చూస్తే తెలుస్తుంది

కృష్ణావతారంగా కృష్ణ గౌరిగా శ్రీదేవి శాంతిగా విజయశాంతి, శ్రీధర్ శ్రీధరే జగన్నాథం కె వి రమణ మూర్తి, గోపాలకృష్ణుడుగా ప్రసాద్ బాబు, ఇంకా వి ఆర్ వరలక్ష్మి, కాంతా రావు కూడా వున్నారు

అతిథి పాత్రలో అల్లు - రాళ్ళపల్లి కన్పిస్తారు

## కృష్ణావతారం కొన్ని ప్రత్యేకతలు

- ★ బాపు తొలిచిత్రం సాక్షి తర్వాత బాపు దర్శకత్వంలో కృష్ణ హీరోగా వెలువడుతున్న చిత్రం-
- ★ పాటల రచయితగా ఇంద్రగంటి శ్రీకాంత శర్మ చిత్రసీమకి పరిచయం అవుతున్న చిత్రం-
- ★ నూతన నటి విజయసుమిత్ర వెండి తెరకి పరిచయం అవుతున్న చిత్రం-
- ★ వైవిధ్యమూ వ్యంగ్య ధోరణిలో నడిచే సంభాషణలూ కల పాత్రలో హీరో కృష్ణ 'కృష్ణావతారం'గా సాక్షాత్కరించడం




RECORDS
ON
HMV









వేలాది కుటుంబాలు అనాదిగా వాడబడుతున్న,
లవంగనూనె ప్రభావాలన్నింటినీ ప్రామిస్‌లో మళ్ళీచూసారు.

# లవంగనూనెతో కూడిన సాటిలేని టూత్‌పేస్ట్ ప్రామిస్

మీరూ ఎందుకు వాడి చూడకూడదు మరి!







**ప్రామిస్**
దంతక్షయంనుండి రక్షణకు
తోడ్పడుతుంది.
నోటిని తాజాగా
రూపొందించి
దుర్వాసనను అరికడుతుంది.



బల్సారా ఉత్పాదన

ఆరోగ్యంచిందే పళ్ళు,
చిగుళ్ళు, తాజాశ్వాస-
అదే మరి ప్రామిస్ వాగ్దానం.

CHAITRA-BIS-4533 R TEL

* జాలీ ట్యూబ్ ఆఫర్ 1982 డిసెంబర్ 31 వరకు
పొడిగింపబడినది - వివరాలకు మీ..
డీలర్‌ను సంప్రదించండి!




వీధి నాటిక

# పెద్దబాలశిక్ష

ఓ పదిమంది నటులు-తెల్ల లాల్చీ, నల్ల పాంట్లతో (మంచిచెడుల సింబల్) జంటనగరాలలో కాలేజీల్లో, కాలనీల్లో, రోడ్ జంక్షన్‌లలో చకచకా 40 నిముషాల సేపు....గుమికూడిన ఐదారువందల మంది పిల్ల, పాపా, పెద్ద, విద్యార్థి, విధాయక నాయకులు....పైకి ఆనందించి లోలోపల ఆలోచించి, కర్తవ్యం గురించి కొంతయినా వత్తిడి తెచ్చే సమస్య, దృశ్యం, నాటిక అది....వాళ్లు ఆడేది.

దానిపేరే "పెద్దబాలశిక్ష" - అది వీధి నాటకం - Street play. వివిధ రాష్ట్రాలలో ఇదివరకే బయలుదేరిన ప్రక్రియ-మొదటిసారిగా, మన తెలుగులో (అనువాదం అనుసరణ కానిది) ఈ వీధి నాటకం మొదలయింది... ప్రతి వీధిలో కనిపిస్తూనే వుంటుంది-ఓ 30 ప్రదర్శనలకి పైగా ఆడేరు.

పంచవన్నెల విశృంఖల ప్రేమసినిమా బ్లాక్ టికెట్ ఐతే ఫర్వేమగానీ, తెలుగు నాటకానికి టికెట్ కొనడమా?! అని చాలా మంది బాధపడనక్కరలేకుండా ఉచితంగా రోడ్డుమీదకే వచ్చే థియేటరు, మేకప్, లైట్లూ, మైకు అక్కరలేని సామాజిక ప్రయోజనకారి - ఈ వీధి నాటకం.

దీన్ని అమృతవాణి సంస్థ-ధర్మ విజయం విభాగం సమర్పించి ప్రోత్సహిస్తోంది. 'పెద్దబాలశిక్ష' రచయిత శ్రీ ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి. దర్శకత్వం శ్రీ తల్లావఝుల సుందరం, పర్యవేక్షణ శ్రీ తనికెళ్ళ భరణి ఇందులో సంభాషణలతోనూ, మూకాభినయం, కదలికల్లోనూ, చూసేవారిని ఎడా పెడా ఆనందింపజేసే నటులు శ్రీయుతులు కె. సుబ్రమణ్యం టి. భరణి, టి. శ్రీనివాస్, గగన్‌విహార్, బి. నాగేశ్వరరావు, బి. అశోక్, ఆర్ ఎల్. నరసింహం, జి. రామకృష్ణ. సి.హనుమంతరావు.

అసలు విషయం : ప్రస్తుత విద్యావిధానంమీద ఇదొక చక్కని సెటైర్.... ఆనందింపజేస్తూ, ఆలోచించమనే శైలి ఈ నాటకంది. సెట్టింగులూ అవీవుండవు గనుక వివిధవిధాల మూకాభినయంతో టే దృశ్యాల్ని సూచిస్తారన్నమాట... మొదట గురుకులంలో విద్యావ్యవస్థ, అక్కడి నుంచి ఇవ్వాల్టి మమ్మీ డాడీ కాన్వెంట్లు, స్కూళ్లు-(అధునికత అంటే అమెరికనైజేషనా?) ఎల్. కె. జి. నుంచి వందల వందల డొనేషన్లూ, ఫీజులూ, భారీ దుస్తులూ, పరీక్షల సమయంలో తీరిగ్గా టెక్ట్స్‌పుస్తకాల నరఫరా ...మధ్యతరగతి నడుం విరిగేలా....

ఇంకో సీన్....కిరోసిన్ క్యూలా కాలేజీసీటు క్యూలు....గైడ్లూ, ట్యూషన్లు, ఫేషన్‌కోసం, ప్రేమకోసం విశ్వవిద్యాలయ ప్రవేశం, తల్లిదండ్రులు కట్టే కన్నీటి డబ్బుతో ప్రపంచ రాజకీయాలోచనలూ, కేంటిన్, లేడీస్ వెయిటింగ్ రూముల విస్తరణకి కూడా కలిసి ఎలక్షన్‌లూ, వివిధ సమ్మెలూ, విద్యా సంవత్సరం మూత, ఇరువశాలదగ్గర రుస్తుం మామూలు వసూలుచేసే గూండాలదేశ విశ్వవిద్యాలయ ప్రహసన పరిష్కారం, నోట్లో నినాదం, వంటపైద ఫేషన్, నేల బారు సినిమాలు, నిద్రాసాహిత్యం, ఆలోచనల్లో యూరోపియన్ - ఇండియా బాలూకు కుర్రాళ్లు పరీక్షల్లో కత్తి కటార్లతో కాపీ వుద్యమాలూ, మేష్టర్ల కాలక్షేపం, నిన్నటి జీతాలు ఎన్నటికీ అందకపోడం, మూడే నబ్జట్లు రాని ముచ్చటైన ఫస్ట్‌క్లాస్ ఘనత, ఉత్తమ పేదవిద్యార్థికి 'కంప్యూటర్ మిస్టేక్'తో జీవన గతిలో మార్పు, రైలుకింద మరణం, మంత్రివర్యులు విద్యారంగాన్ని ఏడాదికోసారి మార్పు చేయడాలూ, వారి వాగ్దానకృషి, విద్యా అయోమయంలో 11+12+18? లేక మరోటా....

ఇదిగో. . ఇలా విద్యా ప్రపంచాన్ని మనముందుంచే సెటైర్ ఈ ''పెద్ద బాలశిక్ష''.

కమర్షియల్ ఉద్యమాలని శుద్ధిచేసి క్రియలోకి దింపే నశాస్త్రీయ నినాదం.... ఆలోచించమని కర్తవ్యాన్ని గుర్తుచెయ్యడం నాటక లక్ష్యం-అందులో కృతకృత్యులు శ్రీ ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి, దర్శకులు, పర్యవేక్షకుడు, నటులు.



# బాపు...  గుండె ఊయల ఊపు 



"పూత రేకుల స్వీటు
కొరివి కారవు ఘాటు
తెలుగు గుండెను మీటు
ఓ బాపు బొమ్మా''

తెలుగు ఆడబడుచుకి కాటుక గురించి చెప్పడం ఎలాంటిదో బాపుగురించి తెలుగువారికి చెప్పడం అలాంటిదే! తెలుగు కళామతల్లి భాగ్యరేఖ, తెలుగు హాస్యరేఖ, సౌందర్యరేఖ, తెలుగువారికి "గీత"-బాపురేఖ.

చాలా చాలా సంవత్సరాల తరువాత ఆంధ్రదేశం అంతటా బాబ్డ్ హేర్, హైహీల్స్ యాంకీ అమ్మాయిలూ, అబ్బాయిలూ ఉత్పత్తి అయ్యాక (హతోస్మి) అప్పుడు ఎవరైనా శ్రీబాపు బొమ్మలు ఓ సారి చూస్తే.... చక్కని అచ్చ తెలుగు పువ్వులాటి ఆడ పిల్ల ఛంగు మనడం, వాల్జెడ, కాటుక రెప్పలూ, ఇంత లేసి కళ్ళు, బొట్టు, గజ్జెలు, పట్టి వగ్గాల్లేని ప్రబంధనాయికలతో సహా తెలుగు ఆడపిల్ల ఇలా నాజూగ్గా వుండేది కాబోలని చెప్పే చరిత్ర శ్రీబాపురేఖ.

ఫేషన్లన్నీ హోరెత్తి వెళ్ళిపోయాకా మళ్ళీ అంచక్కా తెలుగులా, బాపుబొమ్మలా వుండాలనే ఆడపిల్ల చెయ్యని కోరిక నిజం అవుతుంది-అవ్వాలి గనుక.

తెలుగు మనుషుల జీవనసరళి, చరిత్ర చెబుతాయి బాపుబొమ్మలు. తెలుగువారి వట్టుఫిక, తెలుగు పద్యం, తెలుగువీణ, బాపుబొమ్మా చిరంజీవులే..

"చిరంజీవి బాపు" బొమ్మలకి 'రాజాలక్ష్మి' వంటి సువిశాల కళా హృదయం బహుమతి ఇచ్చే పది వేలు తెలుగు దనానికి పదివేలు'!!



# జ్యోతి చిత్రోత్సవం

"జ్యోతిచిత్ర" సూపర్ స్టార్ ఆఫ్ ది ఇయర్ 1981 అవార్డుల ప్రదానోత్సవం ఆగస్టు 15న విజయవాడ తుమ్మలపల్లి కళాక్షేత్రం ఆడిటోరియంలో అత్యంత వైభవంగా జరిగింది.

ప్రముఖ సినిమా వారపత్రిక జ్యోతి చిత్ర ప్రజలచే సూపర్ స్టార్స్‌ను ఎన్ను కోవటం ద్వారా కొత్తపద్ధతిని, సరికొత్త సంప్రదాయానికి బాటలువేసిందని ఆనాటి సభలో పలువురు వక్తలు కొనియాడారు.

జాతీయ చలనచిత్ర అభివృద్ధి సంస్థ అధ్యక్షులు శ్రీ డి. వి. యస్ రాజు ముఖ్య అతిథిగా విచ్చేసి, సూపర్ స్టార్ అవార్డు గ్రహీత శ్రీ యన్. టి. రామారావుకి బదులు ఆయన కుమారుడు చిరంజీవి బాలకృష్ణకు మెమెంటో అంద జేశారు.

సూపర్ స్టార్ (నాయిక) అవార్డును శ్రీమతి జమున జయసుధకు ఇచ్చారు.

సూపర్ డైరెక్టర్ అవార్డును దర్శకుడు కె రాఘవేంద్రరావు, శ్రీ హరినారాయణ రావుకి అందజేశారు.

జ్యోతిచిత్ర, వనితా జ్యోతి నిర్వహించిన లక్కీ స్కీముల్లో బహుమతిపొందిన వారికి కూడా ఇదే వేదిక మీద బహుమతులు అందజేశారు.

మద్రాసునుండి నిర్మాతలు, దర్శకులు, నటీనటులు ఎందరో ఈ అవార్డుల ప్రదానోత్సవానికి విచ్చేశారు.

ఆంధ్రజ్యోతి ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ శ్రీ కె. జగదీష్ ప్రసాద్, బిజినెస్ మేనేజరు శ్రీ యన్. వెంకటేశ్వర్లు కార్యక్రమాన్ని విజయవంతంగా నడిపించారు.

"జ్యోతిచిత్ర" అవార్డులలో కొత్తవుంతలు తొక్కినందుకు "జ్యోతి" మాసపత్రిక అభినందనలు!



# మగమనసు

## శ్రీమతి కోఠారి వాణీచలపతి రావు

వసుంధరకు ఆ రోజు పెళ్ళి చూపులట! ఇంట్లో అంతా చాలా హడావుడిగా ఉన్నారు. ఫలహారాలు ఏమేమి చేయాలో, కాఫీ ఇవ్వాలో, కూల్ డ్రింక్ ఇవ్వాలో తోచక తికమక పడుతున్నారు వంటింట్లో దుర్గమ్మగారు.

నౌకర్లతో డ్రాయింగ్ రూమ్‌లోని సోఫాలు, కుర్చీలు ఒక క్రమపద్ధతిలో అమరుస్తూ, పూలకుండీలలో తాజా పువ్వులు పెట్టమని ఆజ్ఞాపిస్తున్నారు వసుంధర తండ్రి వెంకట్రామయ్యగారు.

"ఏమేవ్! ఇంకా తెమల్లే...ఏం చేస్తున్నావ్ వంటింట్లో?" వంటగది గుమ్మం లో నుండే కేక పెట్టారు ఆయన. లోపలినుండి పిండివంట వాసన గుప్పున రాగానే.... ముక్కుపుటాలు ఎగరేస్తూ, "ఏం చేస్తున్నావ్ దేవిన్?" అని ప్రశ్నించారు.

"కొత్తపెసరపప్పు నానబోసి గారెలు చేస్తున్నాను! ఎంతరుచిగా ఉన్నాయో!.... ఒక్కటి తినిచూడండి!" భర్తచేతికి ప్లేట్ అందించబోతూ అంది దుర్గమ్మ గారు.

"గారెలా! చంపావ్‌పో! ఆ చేసే ముందు ఒక్కమాట నన్నడిగి చేయకూడదూ!" విసుగు ధ్వనించింది ఆయన కంఠంలో.

"ఏం?" బిత్తరపోయి చూసింది దుర్గమ్మ.

"నీ బోడి గారెలూ బూరెలూ - తినటానికి ఆ పిల్లవాడేమన్నా పల్లెటూరి వాడనుకున్నావా? ఫారెన్ వెళ్ళొచ్చిన.... డాక్టర్....తెల్సా?"

"డాక్టర్లు గారెలు తినరా ఏమిటండీ!? మరి ఏం తింటారో చెప్పండి అవేచేస్తాను!"

"సింపుల్‌గా.... నాలుగు బిస్కట్లు పెట్టి 'టీ' ఇవ్వు చాలు!"

"ఇంటికి వచ్చిన పెద్ద మనుషులకు ....కుక్కలకు పడేసినట్టు బిస్కట్లు పెట్టడమేమిటండీ.... అనహ్యంగా!"

అమాయకంగా ప్రశ్నించింది దుర్గమ్మ గారు. "ఇప్పుడదే ఫ్యాషన్‌గా నీ. మాట్లాడకుండా చెప్పింది చెయ్యి!" కసురుకున్నారు వెంకట్రామయ్యగారు

"బోలెడు పప్పు నానబోసి గారెలు వండాను! ఇప్పుడవన్నీ ఏం చేయను?"

"రాత్రికి నీకెలాగూ ఉపవాసంగా! కూర్చుని బొంచేయ్" అంటూ విసురుగా బయటికి వెళ్ళారు ఆయన

తన గదిలో మంచం మీద పడుకుని వారపత్రిక తిరగేస్తున్న వసుంధర తల్లిదండ్రుల సంభాషణ విని తనలో తనే నవ్వుకుంది. వాళ్ళ హడావుడి

చూసుంటే పెద్ద చిరాకుగా ఉంది ఆమెకు. ఏదేశ రాజకుమారుడో వస్తున్నట్లు ఎందుకీ అర్థంలేని ఆర్భాటాలు అతి మర్యాదలు అనుకుంది వసుంధర.

ఉస్మానియా యూనివర్సిటీలో ఎం.ఏ చదువుతున్నది వసుంధర. నిజానికి ఆమెకు అప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు....రీసెర్చి చేయాలని, డాక్టరేట్ సంపాదించాలని ఎంతో ఆసక్తి ఉంది. కానీ తల్లీ దండ్రీ ససేమిరా అని వసుంధర ప్రమేయం లేకుండానే పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నారు. గట్టిగా కాదనడం, మొండికెత్తి సాధించటం వసుంధర స్వభావానికి సరిపడేవికావు. నిండు కుండలా... తొణకని స్వభావం ఆమెది. మర్యాద మన్నన. పెద్దలపట్ల గౌరవం వసుంధరకు పుట్టుకతోటే అబ్బాయి. అతిసామాన్యమైన అలంకరణతో, మిత భాషిత్వంతో "పొందికైన పిల్ల" అని పెద్దల ప్రశంసలందుకుంది వసుంధర.

"ఇంకా ఇలాగే ఉన్నావేమే! అవతల వాళ్ళొచ్చే టయిమయింది! లే! లేచి.... ముఖం కడక్కొని, జడేసుకొని....నా కంచిపట్టుచీర కట్టుకో!" గదిలో కదుగు పెడుతూనే పురమాయించారు దుర్గమ్మ గారు.

"ఇదిగో....నిన్నే....దానికి.... పట్టు చీరకట్టబెట్టి గంపెడు పూలుబెట్టి జాతర్లో అమ్మవారిలా తయారుచెయ్యకు.... ఆ పిల్లవాడికి నచ్చుతుందో, లేదో!" బయటి నుండే కేకపెట్టారు వెంకట్రామయ్య గారు. ఆ మాటతో మూతిమూడువంకర్లు తిప్పిన తల్లివంక నవ్వుతూ చూస్తూ "ప్రత్యేకంగా అలంకారాలెందుకమ్మా! ఇలాగే వుంటాను!" అంది వసుంధర.

"ఏమో! మీ ఇష్టమమ్మా! నాకేం తెలుసు!" అంటూ వచ్చినంత వేగంగా బయటికి వెళ్ళిపోయింది దుర్గమ్మగారు.

o o o

పెళ్ళిచూపులతంతు చాలా సింపుల్‌గా ముగిసింది. పిల్లవాడితో పాటు అతనితల్లీ అక్క మాత్రమే వచ్చారు. పచ్చటిదేహచ్ఛాయతో అందంగా, ఆ ఠీవిగా ఉన్న ఆ పిల్లవాణ్ని చూసి అప్పుడే తమఅల్లుణ్ణి ఊహించుకొని సంబరపడిపోతున్నారు దుర్గమ్మగారు, వెంకట్రామయ్య గారు. వసుంధర అందంలో అతని ముందేమీ తీసిపోదు. ఒకరికొకరు పోటీ పడుతున్నట్టుగా ఉన్నారు ఇద్దరూ. అందుకనే అక్కడికక్కడే పిల్ల తమకు నచ్చిందని అంగీకారం తెలియ చేశారు పెళ్ళివారు. "పెళ్ళిచూపుల" కార్యక్రమం ముగిసే సరికి ప్రొద్దు గూకింది. పెళ్ళివాళ్ళు తిరిగి వెళ్ళటానికి ఇక ఆ రాత్రికి బస్సు, రైలు ఏదీ లేక పోవటంతో అక్కడే ఉండి పోవల్సి వచ్చింది.

భోజనాలు ముగిసి బయటకురాగానే వసుంధరను చూడటానికి వచ్చిన పిల్లవాడు వెంకట్రామయ్యగారితో "ఏమండీ! ఏం తోచటం లేదు! వసుంధరను తీసుకొని సెకండ్ షో పిక్చర్‌కు వెళ్ళొస్తాను!" అన్నాడు.

"సరే! అలాగే!" అంటూ వంట ఇంట్లోకి వచ్చి 'ఏమేవ్! ఆ పిల్లవాడు మన అమ్మాయిని రెండో ఆట సినిమాకు పంపించమంటున్నాడు తనతో" అని భార్య చెవిలో ఊదారు.

దాంతో బుస్సుమని లేచింది దుర్గమ్మ

గారు. "పిల్లేమ! పెళ్ళి కాకముందే సినిమాలు, షికార్లు తిరిగితే ఏం బాగుంటుంది? ఎవరయినాచూస్తే నవ్విపోతారు! అయినా ఆ పిల్లవాడు అదేంటి? ఇందాకా అంతే అమ్మాయితో....మాట్లాడాలంటూ గదిలోకి తీసుకెళ్ళి....తలుపులు బిగించి ఏమేమో మాట్లాడాడు; ఇప్పుడు....ఇలా అంటున్నాడు....అతని స్వభావంఏమిటో నాకు అర్థంగావటంలేదు!"

"పెద్దగా అరవకు! వాళ్ళు వింటారు! నువ్వు అన్నదీ నిజమేగానీ ఆ పిల్లవాడు విదేశాలలో తిరిగివచ్చినవాడు....వాళ్ళకు ఇలాంటి పట్టింపు లుండవు. ఆడా మగా అంతా కలిసిమెలిసితిరుగుతారు అక్కడ. ఇప్పుడు మనం ఏదయినా అంటే.... వాళ్ళకు కోపంవస్తుంది. బంగారంలాంటి సంబంధం చెయిజారిపోతుంది. అయినా ఇందులో ఇంత ఆలోచించవలసిందేముంది? వాళ్ళెలాగూ కాబోయే భార్యాభర్తలేగా...!" తనకూ ఇష్టంలేకపోయినా ఏదో ఒకటి చెప్పి సమర్థించాలనే ఉద్దేశంతో నీళ్ళు నములుతూ అన్నారు వెంకట్రామయ్యగారు.

"ఏమో....ఆ మూడుముళ్లు పడ్డదాకా ఏం నమ్మకం? ఈ రోజుల్లో పీటలమీద పెళ్ళిళ్ళే ఆగిపోతున్నాయి....అయినా అశుభం మాటలు నా నోటితో ఎందుకని విస్తారుగానీ....మీ అమ్మాయిని అడిగి చూడండి....అదికూడా మీతో ఏకీభవిస్తే ఇకనేను చెప్పేదేముంది?" నిష్ఠూరంగా అన్నారు దుర్గమ్మగారు.

"అమ్మాయ్ వసుంధరా'" అని కేకేసి ఏదో చెప్పబోయిన తండ్రిని వారిస్తూ అంది వసుంధర.

"మీరేం చెప్పబోతున్నారో నాకుతెలుసు నాన్నా! నన్ను తనతో సినిమాకు పంపించమని ఇందాక అతను మిమ్మల్ని అడుగుతుంటే విన్నాను. నాకు ఇష్టం లేదని చెప్పెయ్యండి. ఈ అతి చొరవ అంటే నాకు చిరాకు!"

దుర్గమ్మగారు కూతురు మాటలకి సంబరపడిపోతూ గర్వంగా భర్తవంక చూశారు.

వెంకట్రామయ్యగారు తల్లీ కూతుళ్లు ఏకం కావటంతో ఏంచేయాలో తోచక, ఎలా వసుంధరకు నచ్చచెప్పాలో బోధ పడక తికమక పడిపోతున్నారు.

ఇంతమంచి సంబంధం ఎక్కడతప్పిపోతుందో అని ఆయన బాధ ఆయనది.

చివరకు ఎలాగోలా తంటాలుపడి, బుజ్జగించి, లాలించి వసుంధరను 'ఊ' అనిపించేసరికి ఆయన తలప్రాణం తోకకొచ్చింది

వసుంధర, ఆమె కాబోయే భర్త భాస్కర్ ఇద్దరూకల్సి ఆరోజు సెకండ్ షో సినిమాకు వెళ్ళారు.

మూఢాలు కావటంతో....అవి వెళ్ళిన వెంటనే పెళ్ళి జరిగేట్టు.. ....లగ్నాలు పెట్టుకున్నారు ఇరుపక్షాల వాళ్ళు. వచ్చే నెల పదవ తారీకే పెళ్ళి. ఇంకా నెల రోజులే ఉంది.

ఒకరోజు 'వసుంధర' పేరుతో పోస్టులో ఒక కవరు వచ్చింది. ఫ్రమ్ అడ్రస్ దగ్గర "భాస్కర్" అని ఉంది. అది తెరిచి చదవకుండానే తండ్రి చేతిలో పెట్టింది వసుంధర. బుగ్గలు నొక్కుకున్నారు దుర్గమ్మగారు. "ఫరవాలేదు చదువమ్మా! చదివి ఏం రాశాడో

చెప్పు! అన్నాడు తండ్రి. కానీ అందులో తల్లిదండ్రులకు చెప్పగలిగే విషయాలు లేవు! 'రిప్లయ్ ఇవ్వమన్నారు నాన్నా!' క్లుప్తంగా అంది వసుంధర.

'వద్దు!' అంది దుర్గమ్మగారు.

'నేను వ్రాయనులే!' అంది వసుంధర.

"అతగాడికి కోపం వస్తుంది! ఏదో రెండు ముక్కలు సింపుల్‌గా క్షేమ సమాచారాలు వ్రాయమ్మా!" అన్నాడు తండ్రి.

అలాగే తండ్రి బలవంతంతో కేవలం క్షేమసమాచారాలతో వ్రాసి పడేసింది వసుంధర.

పెళ్ళి ముహూర్తం దగ్గరపడే వరకు భాస్కర్ దగ్గరనుండి కామాలు, ఫుల్‌స్టాపులు లేకుండా అలా ఉత్తరాల పరంపర శరవేగంతో వస్తూనే ఉంది.

○ ○ ○ ○ ○

పందిట్లో సన్నాయి మ్రోగింది. బ్రాహ్మణులు ఎలుగెత్తి మంత్రాలు చదివారు. శాస్త్రోక్తంగా వసుంధర మెడలో మూడుముళ్ళు వేశాడు భాస్కర్. అన్ని రోజులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకున్నట్లున్న దుర్గమ్మగారు, వెంకట్రామయ్యగారు తృప్తిగా ఒక నిట్టూర్పు విడిచారు.

గంపెడు కోర్కెలతో, భవిష్యత్తుమీద కమ్మని కలలతో భాస్కర్ జీవితంలో అడుగుపెట్టింది వసుంధర. వసుంధర తోటిదే లోకం అన్నట్లుగా ఆమె ఇష్టాను సారం ప్రవర్తిస్తున్నాడు భాస్కర్. వసుంధరలాంటి అందమైన భార్యను మెప్పించటానికి అనుక్షణం తాపత్రయ పడుతున్నాడు.

"వసూ! పిక్చర్‌కు వెళ్దాం పద!" అన్నాడు భాస్కర్ ఒకరోజు.

"యాక్టర్స్ ఎవరున్నారు ఆపిక్చర్లో?" అడిగింది వసుంధర.

చెప్పాడు భాస్కర్.

"అబ్బ! నాకు ఆ హీరో అంటే అసహ్యం! నేనురాను....మీరుపొండి?"

"ఏం?"

"ముఖమంతా ముడతలు....బుగ్గలు సొట్టలుపడ్డ ఆ హీరోనుచూస్తే నాకు మా తాతయ్య జ్ఞాపకం వస్తాడు....లేవలేక, కూర్చోలేక ....హీరోయిన్‌వెంట పరుగులు పెట్టలేక అతగాడు పడే అవస్థచూస్తుంటే నాలో ఓపిక నశిస్తుంది పిక్చర్ చూడలేక!" అంది వసుంధర ఈసడింపుగా.

"మరి ఎవరంటే ఇష్టం నీకు........ 'చిరంజీవి' పిక్చర్ ఉందిచూస్తావా"

"పరవాలేదు! చూడవచ్చు! అతని కంటే అతని హెయిర్ స్టయిల్ ఇష్టం నాకు....!"

మామూలుగా అన్న వసుంధర మాటలకు తన సొట్ట హెయిర్‌ను తడిమి చూసు కుంటూ పోలేక విచార పడిపోయాడు భాస్కర్. అమరునాడే ఫాషన్ పార్లర్‌కు వెళ్ళి యాభై రూపాయలు సమర్పించుకొని కృత్రిమంగా జుట్టును ఒత్తుగా పుట్టించుకొనిగాని రాలేదు.

అకస్మాత్తుగా మారి పోయిన భర్త వేషం చూసి విరగబడి నవ్వింది వసుంధర.

అలా.... భార్యకు నచ్చే విధంగా.... ఉండటానికి....తన వేషంసైతం మార్చే శాడు భాస్కర్. కానీ....కాలం గడుస్తున్న కొద్దీ .. భర్తలో....ఏదో మార్పు వచ్చినట్టుగా గమనించింది వసుంధర. చిటికి




మాటికీ ఓరాకు పడటం, ఏవేవో ప్రశ్నలతో వేధించటం సాగించాడు భాస్కర్. భర్త ప్రవర్తనకు అర్థం ఏమిటో.... బోధ పడలేదు వసుంధరకు. ఒకరోజు యధాలాపంగా అడుగుతున్నట్లే.... భర్త అడిగిన ప్రశ్నలవల్ల కొంత వరకు.... ఊహించ గలిగింది... అతనువాళ ఆతని మానసిక బలహీనత పూర్తిగా అర్థమయింది.

"వసూ! నాకన్నా ముందు నిన్ను ఎవరయినా పెళ్ళి చూపులు చూశారా?"

"ఓ నలుగురు అబ్బాయిలు వచ్చారు! ఒకతను ఇంజనీరు. ఇంకొకతనేమో లెక్చరర్....ఇక మిగతావాళ్ళేంచేది నాకు సరిగా గుర్తులేదు! మరిమీరు ఎంత మంది అమ్మాయిలను చూశారు?" నందాగా తనూ ప్రశ్నించింది వసుంధర.

"నా ముచ్చటెందుకుగానీ.... ఈ విషయం చెప్పు! నువ్వు అందంగానే ఉంటావు కదా! మరి ఆ సంబంధాలు ఎందుకు కుదరలేదు?"

"ఒకటి మాకే నచ్చలేదు....ఒకటి వాళ్ళకే నేను నచ్చలేదనుకుంటా.... మాటాడకుండా వెళ్ళిపోయారు! మరొకటి కట్నందగ్గర పేచీ వచ్చి ఆగిపోయింది! అప్పుడు! ఇప్పుడీ వివరాలన్నీ ఎందుకడుగుతున్నారు?"

"ఏంలేదు! సరదాకి! అది సరేగానీ వసూ! పెళ్ళిచూపుల అనంతరం వాలాగ నిన్ను తనతో సినిమాకి రమ్మని ఎవరయినా అడిగారా?"

"లేదే!"

## అడవి హస్తాలు

అడవిగాలి పిల్చి
చీకటి పేగుల్ని
వేళ్లతో చీలుస్తూ
రాత్రంతా పోరాడిన
నా....రక్త హస్తాలు
ఎంత అందంగా ఉన్నాయి
ఉదయార్కునికన్నా!!

కొనకంచి శారదాదేవి

"నేనేమీ అనుకోనుగానీ చెప్పవోయ్. ఆరోజు రిక్షాలో నేను నీ నడుంచుట్టూ చెయ్యివేసి చక్కిలిగింతలు పెట్టాను. అలాగే ఎవర నా....?"

"ఛ! ఛ! ఏం సందేహాలండీ మీవి! అసలు సినిమాకే పోలేదంటే....చెయ్యేలాగా అని అడుగుతారేం? అయినా ఎవడో మీద చెయ్యేస్తే నేనెలా ఊరుకుంటాను!" ఆవేశంగా అంది వసుంధర.

"మరి నేను వేస్తే ఊరుకున్నావుగా" సూటిగా వసుంధర కళ్ళలోకి చూస్తూ ప్రశ్నించాడు శాస్కర్.

"మీరు....మీరు వేరు! మీరు నా కాబోయే భర్త. అయినా మీలా సినిమాకు రమ్మని ఇంకెవరూ నన్ను అడగలేదు!"

"అడిగితే వెళ్ళేదానివే నన్నమాట! పీటలమీద పెళ్ళిళ్ళే ఆగిపోతున్న ఈ రోజుల్లో....సంబంధం నిశ్చయమైన ప్రతివాణ్ని 'కాబోయే మొగుడని' వెంటేసుకు తిరుగుతావా?"

"రామ! రామ! ఇంత్కూడి అన్యాయమండీ! అసలు నే నెవరితో తిరగలేదంటే నమ్మరేం? ఆరోజయినా మీరు రమ్మంటే మీకెక్కడ కోపం వస్తుందో అని.... నాన్న అభ్యంతరం మీద మీవెంట వచ్చాను! అయినా ఈరోజు మీకేమయింది? ఎందుకిలాంటి ప్రశ్నలతో నన్ను వేధిస్తున్నారు? అయినా పెళ్ళికాని ఆడపిల్లను....అలా ఒంటరిగా సినిమాకు రమ్మని అడగటం మీతప్పు మాత్రం కాదా?" కోపంగా భర్తవంక చూస్తూ అంది వసుంధర.

"నేను మగవాణ్నే! రమ్మంటాను.... వరుసగల ఇంటి ఆడపిల్లవయితే... అలా ఎవడు రమ్మంటే వాడితో పోతావా? నాతో వచ్చినదానివి....ఇంకోడితో పోలేదంటే నేనెలా నమ్ముతాను? నేనొక ఉత్తరం వ్రాయగానే సిగ్గూ సెరం లేకుండా తగుదునమ్మా అంటూ జవాబిచ్చావే! అలా ఇంకెంతమందికి 'ప్రేమలేఖలు' రాశావో. ఆమాత్రం ఊహించలేనంటావా? నీకు బుద్ధి లేకపోయినా మీ అమ్మా నాన్నల కయినా బుద్ధిఉండొద్దూ! అందుకే అంటారు వదవు ప్రతిష్టలు, సంస్కారం ఉన్న ఇంటి ఆడపిల్లను చేసుకోవాలని! నీ అందం చూసి భ్రమ పడటం.. నాదే బుద్ధితక్కువ!" ఛీత్కారంగా వసుంధరవంక చూస్తూ, విసురుగా తలుపు గడియ తీసుకొని బయటకు వెళ్ళిపోయాడు శాస్కర్.

నిశ్చేష్ట అయి శిలాప్రతిమలా అలాగే నిల్చుండిపోయింది వసుంధర. ఒక మగవాడి అందమైన ఆ ఆటబొమ్మకు భవిష్యత్తు భయంకరంగా కనిపించింది. ★

# అవ్యక్తం

— జి. నరసింహారెడ్డి

"రండి టిఫిన్ చేద్దురు" డ్రాయింగ్ రూంలోకి వచ్చి పిలిచింది అనసూయ.

అప్పటికే బట్టలు ధరించి ప్రయాణానికి సిద్ధమై ఉబుసుపోక పత్రిక తిరగేస్తున్న డాక్టరు రెడ్డి కుర్చీలోంచి లేచాడు

అతను డ్రాయింగ్ రూంలోంచి లోపలికి వెళ్ళబోతుండగా ప్రధాన ద్వారం వైపునుండి "నమస్కారమండి" అన్న గొంతు వినబడింది.

వెనుదిరిగాడు.

ద్వారానికవతల చేతులు జోడించి చిరునవ్వుతో నిలబడి ఉన్నాడు నాయుడు.

"హల్లో మీరా రండి" అంటూ తిరిగి సోఫా వైపు నడిచాడు. నాయుడు [illegible] కొచ్చాడు. డాక్టరురెడ్డికి తెలుసు. ఆ విషయం నాయుడి ద్వారానే చెప్పించాలని ఎదురు కుర్చీలో కూర్చుంటున్న నాయుడుతో "ఏంటి సంగతి తొందరగా చెప్పండి, నాకు అర్జంటు పనుంది" అన్నాడు.

'అదే నా భార్య ఆపరేషన్ సంగతి ..'

"జాయిన్ చేసుకున్నాక ఆపరేషన్ చేయకుండా ఉంటామా, చేస్తాం లెండి"

"అదే కానీ, తొందరగా చేస్తే బావుంటుందని ..."

"అందరూ ఈమాటంటే ఎలాగండీ ...." అంటూ క్యాలెండరు వైపు చూసి "ఈ రోజు సన్‌డే కదూ, ఎల్లుండి ట్యూస్‌డే చేస్తాను సరేనా" సోఫాలోంచి లేచాడతను.

అతనికి తొందరగా వెళ్ళాల్సిన పనుంది. అదీ గాక ఇటువంటి విషయాలను క్లుప్తంగా మాట్లాడి ముగించడం అతని కలవాటు. నాయుడు కూడా లేచి "వుంటానండీ...." అంటూ జేబులోకి చేయి పోనిచ్చాడు.

"ఉండండి మా మిసెస్ వస్తుంది మాట్లాడండి" లోపలికి వెళ్ళిపోయాడు డాక్టరు రెడ్డి.

డబ్బుకు సంబంధించిన విషయాలు



తను మాట్లాడటంకానీ డబ్బును (ఇతరుల నుండి) తన స్వంత చేతులతో తీసుకో వడం గానీ చేయడు తను.

అనసూయవచ్చి నాయకుడితో మాట్లాడి ఆయిదు వందల రూపాయలు తీసుకొని, అతన్ని వంపించి, డబ్బు బీరువాలో పెట్టి

వచ్చేసరికి డాక్టరురెడ్డి టిఫిను ముగించి వచ్చాడు.

"డ్రైవరొచ్చాడా?"

"ఇంకా రాలేదు"

"ఇప్పుడెలా, ఇంకా సేపటో వర్షం వస్తుందే?"

"ఏమయిందో వాడికి"

విసుగ్గా మరోమారు గడియారం వంక చూసుకొని "నరేశ్, ఎంత దూర ముందని రెండు మూడు గంటల ప్రయాణం. నేనే వెళ్ళొస్తా" అంటూ బయటకు నడిచాడు.

"మీ ఇష్టం" అతన్ని సాగనంపడానికి అనుసరించిందామె. గారేజీ వైపు నడుస్తుండగా గేటు తీసుకొని వచ్చాడు రుక్కయ్య.

"దండమయ్యా"

విసుగ్గా అతనివైపు చూశారు దంపతులు.

భయం భయంగా దగ్గరికొచ్చిన అతన్ని చూసి "ఇక్కడికెందుకొచ్చావు?" కోపంగా అడిగాడు డాక్టరు రెడ్డి.

"ఏమిచ్చుకోలేని గరీబోన్ని బాబయ్య దయ చూపాలె," అంటూ వంగి అతని కాళ్ళపైబడి "నా కొడుక్కు జల్ది ఆప్రేషన్ చేయండ్రి" అన్నాడు రుక్కయ్య.

ఇలా రుక్కయ్య కాళ్ళమీద పడతాడని అత నూహించలేదు. అదీగాక ప్రయాణ సన్నద్ధుడై ఉన్నాడాయె. ఎంతో కోపం వచ్చిందతనికి.

"నా గొడవలో నేనుంటే నీదేం దయ్యా మధ్యలో, నడు నడూ" కాళ్ళు వదిలించుకున్నాడు.

రుక్కయ్య తన కొడుకును ఆసుపత్రిలో జేర్పించి నెల రోజులవుతుంది. ఇంతవరకు డాక్టరురెడ్డి అతని వంకే చూడలేదు. డబ్బులు తీసుకోకుండా ఆపరేషన్ చేయడమంటే అతనికెంతో చిరాకు. పేద వాళ్ళని ఎప్పుడూ కరుణ చూపడు వాళ్ళ వైపు చూడకుండానే ఉండే వాళ్ళే ఎక్కణ్ణుంచయినా కష్ట పడి డబ్బు తెచ్చిస్తారని అతని నమ్మకం. అందుకే రుక్కయ్య ఇన్నాళ్ళూ పరీక్షించలేదు.

ఇప్పుడు రుక్కయ్య తనింటికి రావడం బాగానే ఉంది కాని ఏమిచ్చుకోలేననడం మాత్రం అతనికి రుచించలేదు.

"జర దయ సూడుండ్రి బాబయ్యా, నా ఇంట్ల నీ పేరు చెప్పుకొని దీవం పెట్టుకుంట" కఠిన శిలలు కరిగి పోయేంత ఆర్ద్రంగా అన్నాడు రుక్కయ్య.

"ఇటువంటి వాళ్ళతో మాట్లాడి లాభం లేదు అనసూయా, ఇతన్ని పంపించేయి. నేను వెళ్ళొస్తా టైమవుతుంది" అని గారేజీ కెళ్ళి కారులో వచ్చేసరికి అప్పటికే అనసూయ రుక్కయ్యను గేటవతలికి పంపించివేసి ధర్తకు చెయ్యి ఊపింది.

ం ం ం

డాక్టరు రెడ్డి పేరు మోసిన కార్డియోలజిస్టు. ఎన్నో ఓపెన్ హార్టు ఆపరేషన్లు చేసి రాష్ట్రమంతటా ఘన కీర్తుల నందుకున్న డాక్టరు.

అతను పని చేసేది ప్రభుత్వాసుపత్రిలోనే అయినా డబ్బు తీసుకోనిదే అతను ఆపరేషన్ థియేటరులోకి అడుగుపెట్టడు,

లంచం తీసుకోవడం అనేది కూడా ఓ రకమైన జబ్బే. అందుకు అలవాటు




పడినవారు నిజాయితీగా పనిచేయమంటే చేయలేరు. చేసిన ఆపరేషన్లన్నీ విజయవంతం కావడంతో, అతను ఎక్కువ డబ్బు తీసుకుంటాడని తెలిసినా ప్రజలకు అతనే శరణ్యమయ్యాడు. వాళ్ళకు కావలసింది డబ్బు పోయినా రోగం నయం చేసే డాక్టరు!

అతనికో అవిటి కూతురుంది. పేదవాళ్ళనే కనికరంలేకుండా డబ్బు గుంజుతున్నాడు కాబట్టే అతని కూతురు అవిటిదయిందని అతనంటే గిట్టనివారు లోలోపల సంతోషపడుతుంటారు. ఆ కూతురు పెళ్ళిసంబంధనిమిత్తమే డాక్టరు రెడ్డికి ప్రయాణం!

○ ○ ○

వెళ్ళిన పనయితే ఓరకంగా నెరవేరింది రెడ్డికి. అతని అవిటి కూతురును తన ఇంజనీరు కొడుకుకు చేసుకోవడానికి ఒప్పుకున్నాడు రాజగోపాల్ రెడ్డి. కాని అందుకు అతడు అడిగిన కట్నమే కార్డియోలజిస్టు అయిన డాక్టరు రెడ్డి గుండెనే స్తంభింపజేసింది.

రెండు లక్షలు!

కాని తప్పదు. అందుకే ఒప్పుకున్నాడు.

తిరుగు ప్రయాణంలో ఊరు దాటగానే ఫియట్ కారు కదలనని మొరాయించింది.

ఏం చేయాలో అర్థం కాలేదు.

ఆ ఊరుకున్న మట్టిరోడ్డుపై కోపం వచ్చింది. తరువాత తన కారుమీద, చివరకు తనవెంట రాని డ్రైవరుమీద కోపం వచ్చిందతనికి.

"ఏం చేస్తావయ్యా డాక్టరూ, బస్సులో వెళ్ళిపోయి రేపు డ్రైవరును పంపియ్యి" అన్నాడు రాజగోపాల్ రెడ్డి.

అంతకన్నా వేరే గత్యంతరం లేక పోయింది.

అతన్ని మెయిన్‌రోడ్డుమీదున్న జనంతా పురం బస్టాండు దగ్గర దించి బండి వెళ్ళి పోయింది.

షెల్టరు నిండా జనం, సెట్లకిందా జనం. అంతటా గుంపులు గుంపులుగా కూర్చునీ, పడుకొనీ ఉన్నారు ఎక్కడా కూర్చోబుద్ధి కాలేదు తప్పనిసరయై రోడ్డు వారగా నిలబడ్డాడు.

తనేంటి, తన డిగ్నిటీ ఏంటి? ఈ చచ్చు ఆర్టీసీ బస్సులో వెళ్ళడమేంటి? అంతా ఖర్మ-ఆడపిల్లను కన్నందుకు తప్పుతుందా?

ఏదో బస్సొస్తూంది-మహబూబ్‌నగర్ వెళ్ళేది,

ఏదో ఒకటి, జడ్చర్లవరకు వెళ్ళి అక్కడినుండి ఏదయినా ఎక్స్‌ప్రెస్సులో హైదరాబాద్ వెళ్ళొచ్చు

కాని అలవాటు ప్రకారం ఆ బస్సు బస్టాండుకు కాస్త దూరానే ఆగింది. ముసలివారు, ఆడవారు, పిల్లలు ఒకరే మిటి అందరూ పరుగెత్తుతున్నారు. ఎందుకో డాక్టరు రెడ్డి తను నిలబడ్డ చోటునుండి అంగుళం కూడా ముందుకు కదల్లేదు. ఒకరిద్దరు యువకులను ఎక్కించుకొని బస్సు కదలి వెళ్ళింది.

రెండు లక్షలు!

అవిటి కూతురు అత్తారింటికి వెళ్లా లంటే రెండు లక్షలు!!

పెళ్ళికి మరో యాభై వేలు, తనదగ్గర ఇన్నాళ్ళనుండి సంపాదించిన డబ్బు మహా ఉంటే లక్షా యాభై వేలుంటాయి, ఓ యాభై వేలదాకా ఎవరయినా అప్పి స్తారు. అయినా ఇంకో యాభై వేలు కావాలి.

రెండు నెలలో యాభై వేలు!

ఎన్ని ఆపరేషన్లు చేస్తే రెండునెల్లో తను అంత డబ్బు సంపాదించగలడు? ఒక్కొక్క ఆపరేషన్‌కు సరాసరిగా అయిదు వందలు తీసుకున్నా తను రెండునెల్లో వంద ఆపరేషన్లు చేయాలి

యాభై వేలు!

వంద ఆపరేషన్లు!!

టైం చూసుకున్నాడు. మూడు కావస్తుంది. వచ్చి అప్పుడే గంట దాటింది. వచ్చే జీపులను, కార్లను ఆపమని చేయి ఊపుతున్నా ఫలితం లేక పోతుంది. ఎవ్వరూ ఆపడం లేదు.

తన ప్రతిభ మీద, పేరు ప్రఖ్యాతుల మీద అపనమ్మకం కలుగుతుంది. ఆప రేషన్లు చేసి తను ఎందరి ప్రాణాలో నిల బెట్టాడు. ఏ ఒక్కరూ గుర్తుపట్టి లిఫ్ట్ ఇవ్వడం లేదు.

ఒక కారు అతన్ని దాటి రోడ్డు ప్రక్కగా కొంచెం దూరంలో ఆగింది. అతనితో అతడి క్రమంగా కారులోంచి డ్రైవరు కాలోలు దిగాడు. రేడియేటరులోకి నీళ్ళ కొరకు డబ్బా తీసుకొని హోటలు వైపు వెళ్తున్నాడు. వెనక డోరు తెరచి ఇంకెవరో క్కకి దిగాడు.

ఖద్దరు దుస్తులు, బట్టతల, భారీ విగ్రహం— ఎక్కడో చూసినట్లనిపిం పించింది డాక్టర్ రెడ్డికి. చటుక్కున జ్ఞాపకం వచ్చింది.

అతను.... చౌదరి అనుకుంటూ పేరు. అతని కూతురికి తను ఆపరేషన్ చేశాడు. తను ఐదువందలరూపాయలడిగితే అతను

వెయ్యిరూపాయలిచ్చాడు. చాలా మంచి వ్యక్తి, హైదరాబాదుకు వెళ్తున్నారు కాబోలు తనను చూస్తే తప్పక లిఫ్టు ఇస్తాడు. కాని తను ఇక్కడుంటే అత నెలా చూస్తాడు? తప్పదు- తను అతని దృష్టిలో పడేట్లు దగ్గరికి వెళ్ళాలి.

మామూలుగా అటూ ఇటూ చూస్తూ దగ్గరికొచ్చి నిలబడ్డ డాక్టర్ రెడ్డిని చూసి వెంటనే దృష్టి మరల్చుకున్నాడు చౌదరి.

తెలుస్తూనే ఉంది, గుర్తుపట్టి కూడా ముఖం తిప్పుకోవడం తనపై తనకే కాస్తంత కోపం వస్తోంది. తనలాంటి గొప్ప వ్యక్తి చూపు కొరకే ఎంతోమంది పడి గాపులు గాస్తారే అటువంటిది ఈ చౌదరి తన నింత అవమాన పరుస్తాడా? గ్రేట్ ఇన్సల్ట్!

నిజానికి తనూ పలకరించకూడదు. కాని అవసరం తనది. లేకుంటే తనీరోజు హైదరాబాదుకు చేరేట్లు లేదు. ఎంతో బరువుగా, వెనకనుంచి తననెవరో తోస్తున్నట్లుగా బలవంతంగా కారువైపు నడి చాడు. చౌదరికూడా కారులోకి ఎక్క బోతున్నాడు. తను తొందర పడాలి.

"హల్లో, చౌదరిగారూ...." తెలుస్తూనే ఉంది చౌదరికూడా తనకేసిబలవంతంగా తిరుగుతున్నట్లు

"హల్లో మీరూ...."

....దుర్మార్గుడు గుర్తుపట్టికూడా ఎంత యాక్షన్ చేస్తున్నాడో.

"నేనండి, డాక్టర్ రెడ్డిని, అప్పుడే మరచిపోయారా" బలవంతాన నవ్వుతూ అన్నాడు

చౌదరి కూడా నవ్వు పులుముకొని "సారీ, ఇక్కడున్నారేంటి?"

గబగబా తన పరిస్థితినిచెప్పి "మీరు లిఫ్ట్ ఇవ్వాలి"

"సారీ లోపల నా ఫామిలీ ఉంది, మాకే ఇబ్బందిగా ఉంది"

డాక్టరు రెడ్డి ముఖం ముడుచుకు పోయింది. "ఎట్ లీస్ట్ జడ్చర్లవర కయినా...." అతని మాటలు పూర్తికానే లేదు. "సారీ" అంటూ చౌదరి డోరు తెరచుకొని కారులో కూర్చోవడం, కారు కదిలి వెళ్ళటం వెంటనే జరిగాయి.

ముఖం మీద పేడనీళ్ళు చల్లినట్లయింది

ఘోర అవమానం!

గ్రేట్ ఇన్సల్ట్!

చౌదరి కారుడోరుతెరిచినప్పుడు లోప లున్న స్త్రీని తనూ చూశాడు డాక్టరు రెడ్డి. ఆమె అతని భార్యకాదు, కూతురూ కాదు మరెవరు? అందుకే కాబోలుతనను కాదని వెళ్ళింది.

టైం చూసుకున్నాడు.

నాలుగు!

సాయంత్రం కాఫీ తాగంది తనుండ లేడు. ఇక్కడున్న హోటళ్ళలో కాఫీ మాట దేవుడెరుగు కనీసం మంచినీళ్లుకూడా త్రాగాలనిపించడంలేదు.

జనం ఇంకా ఎక్కువవుతున్నారు. ఓ తిరనాలలా తయారైంది బస్టాండు. బస్సులు కొన్నయితే ఆగటమేలేదు. ఆగినవి బస్టాండుకు అమడ దూరం వెనకో ముందో ఆగుతున్నాయి. జనం బస్సుకోసం పరిగెత్తి పరిగెత్తి మళ్ళీ చెట్టుక్రిందికే చేరుతున్నారు.

తనీరోజు హైద్రాబాదుకు చేరుతో లేదా?

రెండు నెలల్లో యాభయివేలు!




వంద ఆపరేషన్లు!

వెంటనే చౌదరి జ్ఞాపకం వస్తున్నాడు. ఆ వెంటనే జరిగిన పరాభవం గుర్తు కొచ్చి సిగ్గుతో కుంచించుకుపోయేలా చేస్తుంది.

అయిదు దాటింది.

తిరిగి అదే ఊరికి వెళ్ళిపోవాలేమో?!

ఈ రాత్రి తను ఒంటరిగా నడిచి మళ్ళీ ఆ ఊరికి....

ఛీ,ఛీ ఎంతటి విపత్కర పరిస్థితి!

కారు మీద కోపం వచ్చింది.

తరువాత అవిటి కూతురిమీద కోపం వచ్చింది.

ఆతరువాత ఎందుకో తనమీద తనకే ఎంతో కోపం!

ఆరు కావస్తుంది.

ఆకలి!

నీరసం!!

వీటన్నింటిని మించి మనసును తొలి చేస్తున్న పరాభవం!!!

జేబునిండా డబ్బుంది-అయినా ఆకలి!

నవ్వొచ్చింది డాక్టరురెడ్డికి.

ఏదో సూపర్ డీలక్సు బస్సొస్తుంది. అదెలాగూ ఆగదుకదా అని దానిగురించి పట్టించుకోలేదు. అదేసమయంలో జడ్చర్ల వైపు నుండి ఓబస్సొచ్చి స్టేజీలో ఆగడమూ దాని వెనకే వచ్చిన ఓ లారీ ఆ బస్సునుదాటి వెళ్ళాలను కోవటంతో ఎదురుగా వచ్చిన సూపర్ డీలక్సు బస్సు స్లో అయింది

ఈలోగా లారీ వెళ్ళిపోయింది.

డీలక్సు బస్సు అతన్ని దాటి పది గజాల దూరంలో ఆగింది. కొంత మంది బస్సుకేసి పరిగెత్తారు.

"ఇది డీలక్సు బస్సయ్యా, ఎవర్నీ తీసుకపోం" అంటూ కండక్టరు బస్సు దిగి డాక్టరురెడ్డి వైపు వచ్చి నమస్కరించాడతనికి. నంస్కారంతో తిరిగి నమ

న్కరించాడు కాని అతనెవరో తనకు గుర్తురావడం లేదు.

"ఎక్కడికి కెళుతున్నారు సార్, సిటీ కేనా?"

"అవును, కారు చెడిపోయింది బస్సు లాగడం లేదు"

"రండి సార్, మాబస్సులో వెళ్దాం"

ప్రాణం లేచొచ్చినట్టయింది.

డోరు దగ్గరున్న జనాన్ని ప్రక్కకు జరగమనిచెప్పి డోరు తెరచి "ఎక్కండి సార్" అన్నాడు కండక్టరు. అతని కంఠంలో కనబడుతున్న గౌరవం వినయం డాక్టరురెడ్డిని ముగ్ధుణ్ని చేశాయి.

ఎంత ఆలోచించినా అతనెవరో గుర్తుకు రావడంలేదు. అందర్నీ ఓమారు పరికించాడు.

టూసీటర్ వైపున కండక్టరు సీటు వెనకాలసీటులో కూర్చొని ఉన్న యువతీ యువకులను చూసేసరికి ముఖం వెలిగించతనికి, ఆయువకునికి అతను ఆరునెలల క్రిందటే ఆపరేషన్ చేశాడు.

ప్రాణదానం చేసిన తనను చూసి గౌరవ పూర్వకంగా సీటు ఇవ్వక పోతాడా అని అనుకున్నాడుగాని అతను తనకేసి కొత్తవాణ్ని చూసినట్లుగానేచూసి ముఖం తిప్పుకున్నాడు,

కండక్టరు అతని వెనకే ఎక్కి డోర్ వేసి "కూర్చోండి సార్" అంటూ తన సీటును చూపించాడు.

"మరి మీరు...." ఎందుకో అతన్ని ఏకవచనంతో సంబోధించాలనిపించడం లేదు.

"మీరు కూర్చొండి సార్, నేనెక్కడయినా సర్దుకుంటాను"-కూర్చున్నాడు.

కండక్టరు ఎదురు సీటుకు ఆనుకొని నిలబడ్డాడు.

అతనెవరో గుర్తుకు రానిది ఏం మాట్లాడాలో అర్థం కాలేదు డాక్టరురెడ్డికి.

"నన్ను మీరు గుర్తుపట్టలేదు కదండీ, నాకు మీరు మూడేండ్ల క్రిందట ఆపరేషన్ చేశారు నాకు కొత్త జీవితాన్నిచ్చారు"

మూడేండ్ల క్రిందటి విషయం తనకెలా గుర్తుంటుంది?

"ఇందులో నేను చేసిందేముంది లెండి, నావృత్తి ధర్మం నేను నిర్వర్తించాను" ఏదో మాట్లాడాలి కాబట్టి అన్నాడు

"అలా అనకండి సార్, మీలా నిజాయితీగా డబ్బు తీసుకోకుండా ఆపరేషన్లు చేసే డాక్టర్లు ఎవరుంటారండీ ."

మాట సూటిగా తగిలింది.

ఎప్పుడు? తను డబ్బు తీసుకోకుండా ఇతనికి ఆపరేషన్ ఎలాచేశాడు, ఎందుకు చేశాడు?

"మేం నిజంగా అప్పుడు డబ్బు ఇచ్చుకోలేని స్థితిలో ఉన్నాం సార్, నేను జాయిన్ అయిన వారం రోజులకే ఆపరేషన్ చేశారు...."

జ్ఞాపకం వస్తూంది అప్పుడు వార్డులో బెడ్స్ ఖాళీ లేవు కాని ఆ మరునాడు తప్పని సరిగా ఓ వ్యక్తిని జాయిన్ చేసుకోవల్సి ఉంది. వెయ్యి రూపాయిలపైన వచ్చే కేసది. మైనర్ ఆపరేషన్ కాబట్టి ఈవ్యక్తికి మరునాడు ఆపరేషన్ చేసి పోస్టు ఆపరేషన్ వార్డుకు పంపించేశాడు.

అయితే డబ్బు తీసుకోకుండా చేసిన కేసు ఇదొకటుందన్నమాట

"అంతకుముందు స్టేజీనుండి వస్తున్నట్లు టికెటిస్తున్నాను, తీసుకోండిసార్"

అంటూ టికెట్లు పంచ్‌చేసి ఇచ్చాడతను.

డాక్టరురెడ్డి జేబులోంచి డబ్బు తీసి ఇవ్వబోయాడు.

"ఏందిసార్, మీవద్ద డబ్బు తీసుకుంటానా, వద్దుసార్''

"మరి....''

"మీకేమీ ఇచ్చే స్తోమత లేనివాళ్ళం. నా సంతృప్తి కొరకయినా మీరు కాదనకండి సార్."

తనింతటి గౌరవానికి అర్హుడా?

"డబ్బు తీసుకోకుండా పేదలకు సేవచేసే మీ పేరు మా ఇంట్లో ఒకసారయినా తలుచుకుంటాం సార్, ఓ మాట చెప్పమంటారా నాకు ఈ మధ్యనే పుట్టిన మగపిల్లాడికి మీ పేరు పెట్టుకున్నాము.....''

'వద్దు, నన్నంత అందల మెక్కించకు. నేను అర్హుడినికాను. నేనేం అంత మహాత్ముణ్ణికాను. నేనూ సామాన్యుణ్ణే, నేను వృత్తిపరంగా ఎవ్వరికీ సేవచేయడం లేదు కేవలం డబ్బుకోసమే చేస్తున్నాను' అని గొంతెత్తి అరవాలనిపిస్తుంది.

"నమస్కారమయినా పెట్టండి, ఎంతయినా మీకు ఆపరేషన్‌చేసి ప్రాణదానంచేసిన డాక్టరు కదా—" వెనుక సీటునుండి మాటలు చిన్నగా వినబడుతున్నాయతనికి

"వీడికి చాలా గర్వం, మనమెందులో తక్కువున్నామని వీడితో మాట్లాడాలి? అయినా వీడు నాకు ఉత్తపుణ్యానికిచేయలేదు కదా; పన్నెండువందలు తీసుకున్నాడు, అదే డబ్బు తీసుకొని వీడుగాకపోతే ఇంకెవరయినా చేసుండేవారు ..."

ఆ మాటల్లో ధ్వనించిన నగ్నసత్యం డాక్టరురెడ్డి గుండెను పిండివేసింది.

బస్సు జడ్చర్లలో ఆగిన వెంటనే కండక్టరు వెళ్ళి కూల్‌డ్రింకు తెచ్చాడతనికి. సీసా అందుకుంటున్నప్పుడు డాక్టరు రెడ్డి చేతులు వణికాయి. మనసు తొణికింది.

తాను రోజు ఈ యువకునినుండికూడా డబ్బు తీసుకొనుంటే ఈరోజు ఇంకా ఆ దరిద్రపు బసాండులోనే....సీరనంగా....

రోజూ త్రాగే కూల్‌డ్రింకే అయినా ఇప్పుడు మాత్రం ఎంతో కొత్తయిన రుచిలో... అద్భుతంగా........అత్యద్భుతంగా ....

"ఇప్పుడు మీ హెల్తెలా ఉంది!" కండక్టరును అడిగాడు ఆప్యాయంగా.

''మీరు ఆపరేషన్ చేయడమూ, నాకు బాగలేక పోవడమా?! ఎంతో ఆరోగ్యంగా ఉన్నానండి. మీ మేలు జన్మలో మరువలేను...." ఇంకా ఏమేమో తనని పొగడుతూ మాట్లాడుతున్నాడు కండక్టరు.

అప్పుడు—

డాక్టరురెడ్డి తన అవిటికూతురు పెళ్ళి గురించి ఆలోచించడంలేదు. నాయుడు భార్య ఆపరేషన్ గురించి కూడా ఆలోచించడంలేదు

కండక్టరు ద్వారా కొత్తగా తెలిసిన కృతజ్ఞతాభావంలోని సరికొత్త ఆనందానుభూతిని గూర్చికూడా ఆలోచిస్తున్నాడు.

రుక్కయ్యకొడుక్కు డబ్బు తీసుకోకుండా ఆపరేషన్‌చేస్తే ఎలాఉంటుందని ఆలోచిస్తున్నాడు.

ఆలోచిస్తున్నాడు!

అనుభూతి చెందుతున్నాడు!! 




శ్రీధర్ మాధవిని పెళ్ళి చూపుల్లో ప్రేమించి మరీ పెళ్ళిచేసుకున్నాడు.

మాధవి చూసే చిలిపిచూపులు ఇష్టం.

మాధవి పెద్ద జడంటె ఇష్టం.

మాధవి సన్నని నడుంఅంటె ఇష్టం.

మాధవి ఆకర్షణీయమైనరూపంఅంటే ఇష్టం

చివరికి మాధవి కట్టుకునే అందమైన

చీరలంటె ఇష్టం....

మాధవి ప్రతి కదలిక, ప్రతి మాట ఎంతో ఇష్టం.

మాధవి మొత్తంమీద ఎంతో ఇష్టం..

అయినా మాధవికి ఆ బొచ్చు కుక్క మీదుండే అవాజ్య మైన ప్రేమ మాత్రం అతనికి సుతరామూ ఇష్టం లేదు. ఎందుకని ఎవరైనా అడుగుతే బుర్రగోక్కుని క్షణకాలం ఆలోచించి సిగ్గుపడ్డం, రహస్యంగా...."షీర్ జెలసీ" అని సమాధానం చెప్పాలి. ఆ సమాధానం, తనలోనికాంప్లెక్స్‌ని ఒక్క మాధవికి తప్ప ఎవరికి తెల్సినా అతనికి అభ్యంతరంలేదు. ఎందుకంటే ఆమె దృష్టిలో తను హీరో లాగా వెలగాలనే వెర్రికోరిక....హీరో లక్షణాలకి జెలసీ అనే లక్షణంపూర్తి వ్యతిరేకం అనిఅతని అభిప్రాయం.

శ్రీధర్, మాధవిల పెళ్ళి అయి నెల ఆయింది. పెట్టిన శెలవ అయిపోవడంతో ఆఫీసులో జాయిన్ అయ్యి ఇళ్ళవేటలో పడ్డాడు.

కాస్త అద్దె ఎక్కువయినా భరించే స్థితిలో వున్నందున మంచి ఇంటికోసం చూడసాగాడు. అలా అని మాధవికి ఉత్తరంలో రాశాడు శ్రీధర్. తిరిగి వెంటనే ఆమెదగ్గర్నుంచి వుత్తరంవచ్చింది క్షేమ సమాచారాలు, విరహవేదన తర్వాత—

"....మీరు మంచిఇంటికోసం వెతుకుతున్నారని రాశారు. చాలా సంతోషం. మీరు ఇల్లు వెతుకుతున్న సమయంలో ఒక ముఖ్యమైన విషయం గుర్తుంచుకోవల్సింది-ఇంటిముందు కాస్త ఖాళీజాగా వుంటె 'సోనీ' తిరగడానికి వీలుగా వుంటుంది. అన్నట్టు మీకు రాయడం మర్చిపోయాను. 'సోనీ'ని నాతో తీసుకొస్తున్నాను. నాకు అది దగ్గర లేకపోతే తోచదు. మా తమ్ముడితో పోట్లాడిదాన్ని తీసుకొస్తున్నాను. ఈవిషయంలోమాత్రం తమ్ముడికి నామీద చెప్పలేనంతకోపంగా వుంది. చిన్నసత్యాగ్రహం లాంటిది జరిపి సోనీని నాతో తెచ్చుకునే హక్కు సంపాదించుకున్నాను. సోనీ క్షణం కన్పించకపోతే నాప్రాణం గిలగిలలాడ్తుంది. దాంతో బంతిఆట ఆడకపోతే సాయంత్రాలు చిన్నబోతాయి. దానికి నేనంటే ఎంత ఇష్టమో తెల్సా? ఒకసారి నాకు నూట నాల్గు జ్వరం వచ్చింది. పిచ్చిముండ....ఎంత బెంగ పెట్టుకుందో తెల్సా? పాలు తాగడం కూడా మానేసి నా మంచం ప్రక్కనే వుండి పోయింది.... నేనుకళ్ళు తెరిస్తే చాలు దాని రెండుకళ్ళు మంచం చివరేసి సుంచుని నా మొహంలోకి బిక్కపోయి చూసేది." మిగతా వుత్తరంఅంతా కుక్క ముచ్చటతోనే నిండి పోయింది. వొళ్ళు మండి పోయి వుత్తరాన్ని టేబిల్ మీద విసిరి కొట్టాడు ... ఈవిడగారిక్కతన మీదకంటె కూడా కుక్క మీద లవ్ ఎక్కువెలాగా వుంది. వుత్తరం చివర దాకా దానికి తనమీద, తనకి దాని మీదున్న ప్రేమ రాసే బదులు..ఏవండీ... నాకిక్కడ మీరులేకుండా ఏం తోచడం లేదు.... ఎప్పుడెప్పుడు వచ్చి మీ ఒళ్ళో వాలుదామాని వుంది....మీవెచ్చని కౌగలి మీ వేడి వేడి ముద్దులు ఎప్పుడు అందుకుందామాని కలలు కంటున్నాను....అని ఎంతో రొమాంటిక్‌గా రాయొచ్చే....ఎంత

సేవు సోనీ. సోనీ.... చూడబోతె తనకి పెద్ద 'రైవల్'గా దాపురించేట్లుందే...బోల్డు నీరసపడి పోయాడు శ్రీధర్. తిరిగి వుత్సాహం పుంజు కోడానికి రెండుసార్లు హార్లిక్స్ తాగాల్సి వచ్చింది.

ఎంతయినా శ్రీమతిగారి కోరిక.... అందులోకి పెళ్ళయిన సరికొత్తలో ఇచ్చిన ఆర్డర్‌కి ఎలిజబెత్ క్వీన్ కున్నంత పవర్ వుంటుంది. అమితాబ్ బచ్చన్ కున్నంత గ్లామర్ వుంటుంది. అందుకే అందమైన ఇంటితో పాటు ఇంటి ముందు కాస్తో, కూస్తో, ఖాళీ జాగా కోసం గాలించ సాగాడు. అతని శ్రమ ఓ పది రోజుల తర్వాత దివ్యంగా ఫలించింది. ఓ రెండు పోర్షన్లకి కలిపి ఇంటి ముందు చక్కటి ఖాళీస్థలం వుంది. మాధవికి సరదావుంటే ఎంచక్కా పూలమొక్కలు కూడా వేసుకోవచ్చని సరదా పడ్డాడు శ్రీధర్.

తాముండే పక్కవాటాలోకి కొత్తగా (గాన టూ ఒకతను తన్ను తాను పరిచయం చేసుకున్నాడు. అతని పేరు ప్రభాకర్‌ట. ఆ రోజు రాత్రి కూర్చుని భార్యామణికి ఓ పొడగాటి వుత్తరం రాసి పారేసాడు. మసాలాలాంటి విరహవేదనని మధ్య మధ్య కలిపి, మరో అయిదు రోజుల్లో వుండే మంచి ముహూర్తానికి బయలుదేరి రావల్సిందంటూ గట్టిగా రాశాడు.

తన దగ్గరున్న సామాను వగైరాలు తీసుకుని కొత్తింటికి మారిపోయాడు శ్రీధర్. తనకి తోచిన విధంగా ఇంటిని సర్దాడు. సర్దిన తర్వాత - "ఆఁహాఁ ఎంచక్కా సర్దాను. నా మాధవి తప్పకుండా మెచ్చుకుని" తీర్తుందని తనకి తనే శెభాష్ చెప్పుకున్నాడు. నాలుగు రోజులు ఇట్టే గడిచి పోయి శ్రీమతి వచ్చే శుభోదయం అయింది - ఆనందోహాలతో బస్సుస్టాండ్‌కి వెళ్ళాడు శ్రీధర్ శ్రీమతిని రిసీవ్ చేసుకోడానికి.

'సోనీ'ని చేతుల్లో ఎత్తుకుని మహారాణీలా బస్సుదిగింది మాధవి. భర్తని చూస్తూనే సిగ్గు, ఆనందం, చిలిపితనం మొదలయినవి తాళింపు పెట్టిన చిరునవ్వొకటి సుందరంగా విసిరింది. ఆ ఆనందంలో శ్రీధర్ 'సోనీ'ని అస్సలు పట్టించుకోకుండా శ్రీమతినే కన్నార్పకుండా చూసాడు రెండుక్షణాలు బస్సునుంచి దిగిన ఇద్దరు ముగ్గురు 'సోనీ'ని నిమిరి దానికి టా టా చెప్తుంటే ఈ లోకంలో పడ్డాడు శ్రీధర్

మాధవిచేతుల్లో గారాలుపోతూ రీవిగా ముడ్చుకున్న సోనీని చూడగానే భలే ఈర్ష్య కల్గింది. అతను మాధవి వైపు రెండడుగులు వెయ్యగానే... .... "నవ్వటోయ్ గుర్తుపట్టానులే...." అన్నట్టు చిన్నగా తోకవూపి, నిర్లక్ష్యంగా అవలించింది ఒకసారి సోనీ దాన్ని కిందకి దింపితే ఎక్కడ కందిపోతుందో అన్నట్టు తన చేతుల్లోనే పొదవిపట్టుకుందిమాధవి

కొత్తగా సంసారం పెట్టటం కదా? ఏవేవో సామాన్లు తెచ్చింది ఆ సామానంతా చూసిన శ్రీధర్‌కి రెండు ఆటోలు చాలవనిపించి టాక్సీ మాట్లాడాడు. టాక్సీలో కూర్చోగానే—"ఏవండీ" మీరు చూసిన ఇల్లు బాగుందా? 'సోనీ' ఆడుకోడానికి ఇంటిముందు స్థలం వుందా?" అని అడిగింది. వచ్చిన కోపాన్ని నవ్వులోకి మార్చుకుని—"అఁహాఁ....రాణీ గారు

ఆర్డరు వెయ్యడం అది అమలుపెట్టక పోవడమా?.. నీ సోఫీ ఆడుకోడానికి చక్కటి ఖాళీస్థలం వుంది" అన్నాడు బొచ్చుకుక్కవైపు చూస్తూ మాధవి తృప్తిగా నవ్వుతూ కుక్కని ఎంతో ఆప్యాయంగా నిమురుతూ-"పిచ్చిముండ రాత్రంతా అలా మేల్కొనే కూర్చుంది. అవతల సీట్లో అతను అదే పనిగా నా వంక చూడడం దీనికే మాత్రం నచ్చ నట్టుంది గుర్రుగా చూస్తూ నాకు కాపలా కాసింది తెల్సా...."

తన భార్యవంక ఎవరో చూడడం కించిత్ గర్వం కల్గించినా మరో క్షణం నచ్చలేదు తనకి నచ్చనిది కుక్కకికూడా నచ్చకపోవడంతో సోఫీమీద కొద్దిగా ఇష్టం కల్గింది శ్రీధర్‌కి.

మరో పదినిమిషాలకి ఇంటిముందు టాక్సీ ఆగింది. కుక్కనెత్తుకుని టాక్సీ లోంచి దిగింది మాధవి. సామానంతా జాగ్రత్తగా లోపల పెట్టించాడు శ్రీధర్. టాక్సీ ఇంటి ముందు ఆగినప్పట్నుంచి శ్రీధర్ సామాను లోపల పెట్టించేవరకు పక్కింటి వాటాతను గుమ్మంలో నిలబడి చూస్తుండడం గమనించాడు శ్రీధర్. అతనికి సుతరామూ నచ్చలేదు. మర్యాద కోసం ఓ నవ్వు పారేసి లోపలికి వెళ్ళి పోయాడు. మాధవి ఇల్లంతా కలయ తిరుగుతూ చూస్తోంది. తెల్లగా బొద్దుగా మెరిసి పోతున్న "సోఫీ" మాధవి కొంగు పట్టు కున్నట్టుగా తిరుగు తోంది - ఆమె వెంట అతను లోపలికి రావడం చూసిన మాధవి నవ్వుతో-"చాలా మట్టుకు సర్దేసి

నట్టున్నారే....” అంది. ఆమె దగ్గరగా వెళ్ళి ఆమెను రెండు చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు శ్రీధర్...."హోం మినిస్టర్ గారు రాగానే అన్ని రెడీగావుంటే బాగుంటుందని ...” అని నవ్వాడు.

వాళ్ళకి కొద్ది దూరంలో నిలబడ్డ "సోనీ'' కన్నార్పకుండా ఇద్దర్ని చూడ సాగింది. అతని బిగి కౌగిలిలో కరిగి పోతున్న మాధవికి, భార్య స్పర్శానందంలో వున్న శ్రీధర్కి టైము తెలియ లేదు. రెండు మూడు క్షణాలు అలాగే చూసింది సోనీ. ఆతర్వాత వెనక రెండు కాళ్ళమీద కూర్చుని కదలకుండా మరో రెండు క్షణాలు చూసింది.

ఊఁహుఁ....వాళ్ళీలోకానికి రాలేదు. దానికి మాధవి తన్నలా వదిలెయ్యడం నచ్చనట్టు అసహనంగా లేచి నిలబడింది. ఇద్దరి చుట్టూ తిరిగి మాధవి దగ్గరగా వెళ్ళింది.

అప్పటికీ ఆమె దాన్ని పట్టించుకో లేదు. కోపం వచ్చి తలెత్తి లోగుంతులో మొరిగింది సోనీ.

భర్త నన్నగా చెవిలో చెప్తున్న ప్రేమ పదాలు వింటున్న మాధవి తేరుకుని ఈ లోకానికి వచ్చింది.

మళ్ళీ వెనకాళ్ళమీద కూర్చుని సీరి యస్గా ఆమెహంలోకి చూసింది సోనీ..

"ఓహ్....ఏమండి....పాలున్నాయా? పాలు కావాలండి....సోనీకి పాల టైము అయింది...." హడావుడిగా భర్తని వది లించుకుంటూ అన్నది మాధవి. మళ్ళీ ఆ బొచ్చు కుక్కమీద కోపం వచ్చేసింది శ్రీధర్కి.

దాని మీద ఎంత శ్రద్ధో....అది తన వైపు గుర్రుగా చూస్తున్నట్టని పించింది శ్రీధర్కి. మాధవి మరో వైపు తిరిగి వుండడంతో చెయ్యెత్తి కొట్టినట్టు అభిన యించాడు శ్రీధర్. వెంటనే లేచి నిలబ డింది సోనీ డిఫెన్సివ్గా. చెవులు నిక్క బొడ్చి గయ్మంది. వెంటనే ఆ గదిలోంచి వెళ్ళి పోయాడు శ్రీధర్-మాధవి దాన్ని నముదాయిస్తున్నట్టు మాట్లాడ్తున్న మాటలు వినిపించుకోకుండా.

ం ం ం

పదింటి లోపల కాఫీలు, టిఫిన్లు తెప్పించుకున్నారు శ్రీధర్ మాధవి. ఆఫీసుకెళుతూ — వంట ప్రయత్నం ఏమీచెయ్యకు మధూ ఆఫీస్బాయ్ వస్తాడు టిఫిన్ కారియర్ ఇస్తే మీల్స్ పట్టు కొస్తాడు'' అని చెప్పాడు.

"అలాగే మీరొచ్చేలోపల ఇల్లంతా అద్దంలా సర్ది వుంచుతాను. సాయంత్రం త్వరగా వచ్చేయండి........" నవ్వుతూ చెప్పింది మాధవి, గుమ్మంలోనుంచుని, "ఓయస్ ...ఆమాట నువ్వు చెప్పాలేమిటి? డబ్బులుపోతే పోయాయి. ఆటోలో వచ్చెయ్యనూ...." హుషారుగా చెప్పి, కులాసాగా బయలుదేరాడు శ్రీధర్.

సాయంత్రం అన్నట్టుగానే అయిదుం బావు కల్లా ఆటోకి రెక్కలు కట్టినట్టు పురుకులు పరుగులుమీద వచ్చాడు. వస్తూ వస్తూ గులాబీలు, మల్లెలు, స్వీట్స్, పచ్చి మిరపకాయ బజ్జీలు తీసుకొచ్చాడు. అతను గేటుతీసుకొని లోపలికి వస్తుంటే గుమ్మంలో నిలబడ్డమాధవి, ఖాళీజాగాలో తిరుగుతున్న సోనీ కన్పించాయి. వాళ్ళతో పాటు పక్కవాటా గుమ్మంలో నిలబడ్డ ప్రభాకర్ కూడా కన్పించాడు. శ్రీధర్ని




చూస్తూనే న వ్వాడతను.

ఇతగాడికింకేం పనిలేదేమిటి పక్క వాళ్ళని చూడడం తప్ప-చిరాకేసింది శ్రీధర్‌కి. అయినా నవ్యత కోసం నవ్వాడు.

వెంటనే అతనికి ఓ అనుమానం వచ్చింది. ఇంతకీ అతను మాధవిని చూస్తున్నాడా? లేకపోతే బొచ్చు కుక్కనా?.... లేకపోతే రెండింటినా? ఊఁహూఁ.... మాధవినే అయ్యుండాలి అనుకోగానే మొహం సీరియస్సయి పోయింది.

"అదేమండి? అలా వున్నారేం? ఒంట్లో బాగు లేదా?" బెంగారుగా అతనితోపాటు లోపలికివస్తూ అడిగింది మాధవి.

"అబ్బెబ్బె. అదేంకాదు........ఏమిటి ఇల్లంతా సిజంగా అద్దంలా సర్దేసినట్టున్నావే...." పక్కింటతన్ని పక్కకి తోసేసి మాములుగా అయిపోయాడు శ్రీధర్ మాధవి కంగారుచూసి.

కాని బెడ్‌రూంలోకి వచ్చిన అతని మొహం మళ్ళీ సీరియస్సయిపోయింది.

"ఇదేమిటి మధూ నేను బెడ్‌పక్కన ప్రత్యేకంగావేసిన సన్‌గ్లాస్ టేబిల్ ఏదీ?"

"ఓ....అదా....మరి సోనీకి నా బెడ్ పక్కనే పడుకోడం అలవాటండీ, అందు కని ఆ టేబిల్‌ని డైనింగ్ టేబిల్ పక్కన వేశాను, దానిమీద గిన్నెలన్నీ పెట్టుకుని భోజనం మాత్రం డైనింగ్ టేబిల్‌మీద చేస్తే విశాలంగా కూడా వుంటుంది. అసలది మన మంచంపక్కన ఎందుకండీ....వేస్టు కదా?"

వేస్టా.ఒళ్ళు...మండిపోయింది శ్రీధర్‌కి. తనెంత వూహతో ఆ టేబిల్‌ని అక్కడ వేశాడు - దానిమీద రాత్రిపూట అగొరొత్తులు వెలిగించిపెట్టుకుందామని, పళ్ళు,పాలు మాధవి అమరిస్తే బెడ్‌మీద కూర్చుని అవి తింటూ తియ్యతియ్యగా కబుర్లు చెప్పుకుంటూ....ఈవిడగార్కి ఆ కుక్క సుఖసౌఖ్యాలు, దాని అలవాట్లు తప్ప

మిగతా విషయాలేమీ దృష్టిలోకి వచ్చేట్లు లేవే.

"అదేమిటండి? అలా నిలబడి పోయారు?"

"అది నీ బెడ్‌పక్కన పడుకోక పోతే నీకు నిద్రరాదా? దానికి రాదా?" నగం నవ్వుతూ నగం సీరియస్‌గాను అన్నాడు.

మాధవి దగ్గరగా వచ్చి అతని షర్టు గుండీలు విప్పుతూ గోముగా-"మీకు కోపం వచ్చినట్టుగా వుంది మీకిష్టం లేక పోతే దాని బాస్కెట్ ఇంకోవైపుకి మారుస్తాను లెండి. మీరు వేసినట్టుగా టేబిల్ మళ్ళీ పెట్టేద్దాం" అతని కళ్ళ ల్లోకి చూస్తూ అన్నది.

దాంతో అంతటి మనిషి ఐస్ అయి పోయాడు. భార్య కాంప్రమైజ్ అయ్యే సరికి అతను తన హీరో లక్షణం-దయా గుణం-చూపించదల్చుకున్నాడు. ఆమెను ఆప్యాయంగా దగ్గరకు తీసుకుని-"ఇట్సాల్ రైట్ మధూ నీకిష్టం అయిన దాన్ని నేను మాత్రం కాదంటానా? సోనీ బాస్కెట్ అక్కడే వుంచుకొని ఆ టేబిల్ మాత్రం బెడ్‌కి ఇవతలవైపు వేద్దాం" అని తనెందుకు ఆ టేబిల్ అక్కడ వేశాడో వివరించాడు శ్రీధర్.

సోనీకి బిస్కెట్లు వేసి, శ్రీధర్ తెచ్చిన పొట్లాలు విప్పింది మాధవి.

o o o

ఆరోజు ఆదివారం బద్ధకంగా ఒళ్లు విరుచుకుని కళ్ళు విప్పాడు శ్రీధర్. ఎదురుగా గోడ గడియారం సరిగ్గా అప్పుడే తొమ్మిది గంటలు కొట్టింది. "మధూ" ముద్దుగా పిల్చాడు శ్రీధర్.

"........"

"మధూ...." ఈసారి స్వరం హెచ్చింది.

"........"

"ఓ....మధూ...." అరిచినట్టు కేక పెట్టాడు.

"ఆఁ....ఆఁ....వస్తున్నానండి....." తనూ అంతే స్థాయిలో జవాబిచ్చింది మాధవి. మరో అయిదు నిమిషాలకి దర్శనం ఇచ్చింది ప్రియ శ్రీమతి. అతని వైపు కనీసం కన్నెత్తయినా చూడకుండా చేతిలో వున్న సోనీని కిందకి దింపి టర్కీ టవల్ తో తుడుస్తూ-"అమ్మయ్య-లేచారా....ఎంతకీ లేవరేమిటాని చూస్తున్నాను-లేపితే కోపం వస్తుందేమో అనుకున్నాను. ఏవండీ ...ఇవాళ దీనికి స్నానం చేయించేసరికి తలప్రాణం తోక్కొ వచ్చిందనుకోండి ఎంత అల్లరి పెట్టిందనుకున్నారు. దొంగముండ ..కాఫీ డికాషను తీసుంటే నా కొంగుతో ఆడుకోదం... తన్నేద్దామనుకున్నాను........" చెప్పుకుపోతూ దానికి పౌడరు రాయడంలో అతి శ్రద్ధగా మునిగిపోయిన భార్యని చూస్తుంటే కోపం చరచరా పాకింది శ్రీధర్‌కి. రెండురోజులు చూసి నేనే తన్నేస్తాను. అసలు ఆదివారం ఎంత తియ్యగా మొదలవ్వాలి. అలా మొదలవ్వాలంటే మొదలు శ్రీమతి తియ్యని మాటలతో, తియ్యని ముద్దులతో భర్తని నిద్ర లేపాలి....ఎంత తియ్యటి స్వీట్ నథింగ్స్ అవి....హూ..,ఈ వెధవ కుక్క మూలంగా తనకవన్నీ దూరం అయి పోతున్నాయి.

వెంటనే అలిగేద్దాం అనుకున్నాడు శ్రీధర్. కాని అలిగితే సరిగ్గా అలగాలి.

అంటే...... మంచంమీదనుండి కదల కూడదు. మొహం కడుక్కోకూడదు ఆవిడొచ్చి తెగబతిమాలేవరకు కాఫీ తాక్కుండా బెట్టు చెయ్యాలి ఆ తర్వాత తనని బలవంతంగా మంచంపైనుండి లేపి బాత్రూమ్‌లోకి తీసుకెళ్ళి స్నానం చేయించాలి... ఇలాగే బతిమల్తూ టిఫిన్ తినిపించాలి... అబ్బ....అలగడం అంటే మాటలా... ఇవన్నీ....అంటే తను అలిగితే ఏం చెయ్యాలి....తన అలక ఎలా తీర్చాలి అన్న రూల్స్....పాపం మాధవికి తెలియవు కదూ?....తనిప్పుడు అలిగితే ఆవిడ సరిగ్గా తన రూల్స్ ప్రకారం నడుచుకోకపోతే....తన ప్రిస్టేజ్ అంతా కరిగి నీరయి మురిక్కాలవలో కలిసి పోతుంది. అందుకే మధుకి తన అలక రూల్స్ తెలిపేవరకు తను అలక్కూడదు. సో....అలక కాన్సిల్....

మంచంమీద లేచి కూర్చున్నాడు శ్రీధర్. సోసికి పౌడర్ రాస్తూ-"లేచి మొహం కడుక్కోండి కాఫీ రెడీగా వుంది" అంది మాధవి.

ఉస్సురని లేచి బాత్రూమ్‌వైపు నడిచాడ శ్రీధర్ ఒకమాదిరి విశాలంగా వున్న పెరట్లో ఎవరి వాటావైపు వారి బాత్రూమ్, లెట్రిన్స్ కట్టివున్నాయి. యధాలాపంగా తలతిప్పి చూసిన అతనికి ప్రభాకర్ భార్య తులసికోటదగ్గర పూజ చేసుకుంటూ కన్పించింది. ఆమె శ్రీధర్‌ని చూస్తూనే అతి సీరియస్‌గా ఓ చూపు విసిరి తల తిప్పేసుకుంది. ఆమె వింత ప్రవర్తనకి క్షణం విస్తుపోయి తన

కెందుకు లెమ్మనుకుని తనపని పూర్తి చేసుకుని లోపలికి వచ్చాశాడు శ్రీధర్.

పౌడరు రాయడం పూర్తిచేసి 'సోసీ' తెల్లటి బొచ్చుని దువ్వుతోంది మాధవి. మొహం తుడుచుకుంటూ అద్దంలో చూసుకుంటున్న భర్తతో-"ఏవండీ..ఈపక్క వాటా ఆవిడలేదూ....ఆవిడ పద్ధతి నాకేం నచ్చలేదు" కాస్త గొంతు తగ్గించి అన్నది మాధవి.

"ఏం...." ఏమీ ఎరగనివాడిలాగా అన్నాడు.

బొత్తిగా సంస్కారం లేని మనిషి లాగా వుంది. మెరట్లో కనిపిస్తే ఎంతయినా కొద్దిరోజులు కలసి వుండేవాళ్ళం కదాని నవ్వుతూ పలకరించబోతే మొహం తిప్పుకుని లోపలికి వెళ్ళిపోయింది. నేను సోసీకి స్నానం చేయిస్తుంటే తలుపు పక్కన తారట్లాడడం చూశాను"

కలుపుగోలుమనిషి కాదేమో....అయినా వాళ్ళు ఎలావుంటే మాత్రం మనకెందుకు లెద్దు...." అయితే భర్తకేమో పక్కింటి వాళ్ళకేసి చూసే జబ్బు....భార్యకేమో పక్కింటి వాళ్ళంటే గిట్టదు....చిత్రమైన జంట....క్రాఫ్ చేత్తోసరిచేసుకుంటూ అనుకున్నాడు.

"అదికాదండి, ఎంతయినా ఇరుగు పొరుగు వాళ్ళం కదా? కాస్త స్నేహంగా వుంటే ఏం పోయిందండి" అంది లేచి నిలబడుతూ.

"ఆవిడకేంపోతుందో మనకేం తెలుస్తుంది చెప్పు....ఇంతకీ ఇవాళ టిఫిన్ ఏమిటి శ్రీమతిజీ...." మాట మార్చేశాడు శ్రీధర్.

"పెసరట్టు వుప్మా ప్లస్ కొబ్బరి చెట్నీ, కారప్పొడి, నెయ్యి, మంచినీళ్ళు.. ఇవన్నీ పెట్టుకోడానికి డైనింగ్ టేబిల్, అమర్చడానికి శ్రీమతి, తినడానికి శ్రీవారు...." నవ్వుతూ అంది మాధవి.

"గుడ్...నీకు సెన్స్ ఆఫ్ హ్యూమర్ వుందన్నమాట....నాకు ఎప్పుడూ సీరియస్‌గా వుండేవాళ్ళంటే మంట...." శ్రీమతి పైటచెంగు లాక్కుని ఆమెని దగ్గరగా తీసుకున్నాడు. ఆమె అతని కౌగిటలో కదుగుతూ—"అయితే మీకు పక్కింటావిడంటే మంటన్నమాట...." నవ్వేసింది.

"చాల్లే........ఆవిడ వింటే మూడో ప్రపంచయుద్ధం మొదలవుతుంది!

o o o o

రోజు శ్రీధర్ వచ్చే టైముకి మాధవి. సోసీ వాకిట్లో వుండడం, వీళ్ళని ముఖ్యంగా మాధవిని (అదే శ్రీధర్ గట్టి నమ్మకం) చూడడానికి పక్కింటి వాటా గుమ్మంలో ప్రభాకర్ నుంచొనివుండడం రొటీన్ అయిపోయింది. ఇది ఏ మాత్రం నచ్చడంలేదు శ్రీధర్‌కి. సోసీ అలా సాయంత్రాలు బయటనుంచోవద్దని, బొచ్చుకుక్కతో ఆడుకోవద్దని చెప్దామని ఎన్నోసార్లు నోటి చివరిదాకా వచ్చి కూడా అభిమానపడి నోరు కట్టేసుకున్నాడు. అలా చెప్తే మాధవి ఏం అనుకుంటుంది. పుట్టి అనుమానపుపక్షి అనుకోదూ....అమ్మో అలాంటిరిమార్క్ తన హీరోయిజానికి గొడ్డలిపెట్టులాంటిది. సోసీ ప్రభాకర్‌తో చెప్పేనో....తన్నో పూల్ కింద చూసి-నేను మీ ఆవిణ్ణి చూడడంలేదు....బొచ్చుకుక్కని అంటే? అసలు నేను నుంచునేది నా వాటా



గుమ్మంలో... చల్లగాలికోసం...అంటేనో ఛ....ఇవేమి కుదిరే వద్ధతులు కాదు.... ఖాళీ దొరికినప్పుడల్లా ఆఫీసులో... రోడ్డు మీద....రాత్రిపూట మంచ మీద....నిద్ర పట్టనప్పుడు....తెగ ఆలోచిస్తున్నాడు.

ఆరోజు సాయంత్రం అతను ఆఫీసు నుంచి వచ్చేసరికి అతనికి కళ్ళు బైర్లు కమ్మినంత పనయింది. ఏమిటి? ప్రభాకర్ గుమ్మంలో కాక గుమ్మం ఇవతలకి రెండడుగులు ఇవతలకి వేసి నుంచు న్నాడు, ఇకిలిస్తూ....మాధవి బొచ్చు కుక్క వైపు బంతి విసురూ ఏదో అంటోంది. ఒళ్ళు మండి పోయింది శ్రీధర్‌కి. ఇక లాభం లేదు. వీడు మెల్లగా మాధవిని మాటల్లో కూడా పెట్టున్నాడు. దీనికేదో పరిష్కారం ఆలోచించాలి....

....హల్లో....ఎంతో స్నేహంగా పలకరించాడు ప్రభాకర్. పెదాలు కదలీ కదలనట్టుగా సమాధానం ఇచ్చి గబగబా లోపలికి వచ్చాడు శ్రీధర్. వెనకేమాధవి, ఆమెతో పాటు. బొచ్చుకుక్క లోపలకి వచ్చారు.

"ఏవండీ.... పాపం పక్కింటతను ఎంత మంచివాడు అనుకున్నారు. అతనికి బొచ్చుకుక్కంటే ఎంతో ఇష్టం అట ...వాళ్ళావిడకి ఇష్టం లేదట....వాళ్లావిడకేమో ఎవరూ గిట్టరట....అతనికేమో ఇరుగు పొరుగుతో స్నేహం చెయ్యాలని వుంటుందట" గలగలా చెప్తోంది మాధవి.

ఊహుం....అందమైన ఆడవాళ్ళతో స్నేహం చెయ్యాలని వుండదూ? బొచ్చు కుక్కంటే ఇష్టంట.... ఆ సమయంలో మాధవి దగ్గిర పిచ్చికుక్క వున్నా ఇష్టం అనడూ?....ఈవేషాలు తన దగ్గిర కుదరవు....వెంటనే మరో ఇల్లు చూసేసి మారాల్సిందే....గట్టిగా నిర్ణయం చేసుకున్నాడు శ్రీధర్.

ఇలా ఓ వారం రోజులు గడిచి పోయాయి.

ఓ రాత్రి పూట దాహం వేసి మంచినీళ్లు

కోసం లేచాడు శ్రీధర్. టేబిల్ మీద మంచినీళ్ళు పెట్టడం మర్చిపోయినట్టుంది మాధవి అనుకుని వంటింట్లోకి వెళ్ళాడు. బిందెలోంచి మంచినీళ్ళు ముంచుకుంటుంటే వెక్కి-వెక్కి ఏడుస్తున్న శబ్దానికి వులిక్కి పడ్డాడు శ్రీధర్. ఎకణ్ణుంచాని శ్రద్ధగా విన్నాడు.... పక్కవాటాలోంచి స్పష్టంగా వినిపిస్తోంది. కుతూహలం అణుచుకోలేక గోడ దగ్గరగా వెళ్ళాడు శ్రీధర్.

"నాకన్నీ తెల్సు....నేను అందంగా లేననే కదా....ఆ పక్కింటావిడ వైపు ఇంత కళ్ళు చేసుకుని చూస్తున్నారు"

"ఛ....ఛ.... నీకెప్పుడు అనుమానమే, నిన్ను చూస్తే...." విసుక్కుంటున్నాడు ప్రభాకర్‌లో గొంతులో.... గోడకి అతుక్కుపోయి వింటున్నాడు శ్రీధర్, "అనుమానం కాకపోతే మీరు చేస్తున్నదేమిటి? రోజూ సాయంత్రం అలా గుమ్మంలో మంత్రించిన బొమ్మలాగా నిలబడడం ఎందుకు? పైగా ఈ మధ్య మాటలు కూడా మొదలు పెట్టారు...." వెక్కిళ్ళ స్థాయిలోకి వొచ్చింది.

"నోర్ముయ్. నీ సంకుచిత బుద్ధి బయట పెట్టుకుంటున్నావు నీ ఇన్ఫీరియర్ కాంప్లెక్స్‌తో నా ప్రాణాలు తీస్తున్నావు. అయినా నేను గుమ్మంలో నిలబడేది నువ్వనుకునే దానికి సంబంధం లేదని చెప్తున్నాను-నమ్మకపోతే నీఖర్మ" విసురుగా ఏదో పడ్డది కింద.

"ఆం....నాఖర్మే... అంతా నాఖర్మ. చేస్తున్న వెధవ పనికి సమర్థనలు'' ఆ పైన అయిదునిమిషాలు గడచినా ఏడ్పు తప్ప మాటలువిన్పించలేదు.... వింటున్న శ్రీధర్ మెల్లగా ఇవతలికి వచ్చేశాడు. అయితే అతని భార్య అనుమానిస్తోందన్న మాట....బహుశా తన అనుమానం ఏ అనుమానం లేకుండా నిజమే అయి వుండాలి.... ప్రభాకర్ భార్య షుమారుగా సంసార పక్షంగా వుంటుంది. కాని మాధవి.... చూడగానే ఆకర్షించే వంపుసొంపులున్నది. అందుకే అతగాడలా ప్రవర్తిస్తున్నాడు తను చూసిన రెండు మూడు ఇళ్ళల్లో ఏదో ఒకటి ఖాయం చెయ్యాలి....అనుకుని తిరిగి బెడ్ రూంలోకి వచ్చేశాడు శ్రీధర్.

ఆ మర్నాడు తనకి నచ్చిన ఇంటికి ఎడ్వాన్స్ ఇచ్చేసి వచ్చాడు శ్రీధర్ ఆ విషయం మాధవికి చెప్తే నిర్ఘాంతపోతూ చూసింది. "అదేమిటండి? ఈ ఇల్లు మనకి సౌకర్యంగానే వుంది కదా? పైగా అన్ని ఇళ్ళకి ముందు ఖాళీ జాగాలు దొరకవు.. పాపం సోనీ హాయిగా ఆడుకుంటోంది." బిక్క మొహం వేసిన మాధవిని చూడగానే కరిగిపోటోయి తమాయించుకున్నాడు.

"సోనీకోసమని నాకునచ్చని ఇంట్లో, నచ్చని పరిసరాల్లో వుండమంటావా?'' నవ్వుతున్న భర్త మాటల్లోని సీరియస్‌నెస్‌ని కనిపెట్టగల్గింది మాధవి. అందుకే మౌనంగా లోపలికి వెళ్ళిపోయింది. ఫస్ట్ మరో వారంలో వుంది. ఫస్ట్ ముందు వచ్చిన ఆదివారాన్ని ఇంటి షిఫ్టింగ్‌కి ముహూర్తం పెట్టుకున్నాడు శ్రీధర్. ఆ రోజు శనివారం. ఆఫీసునుంచి రాగానే టిఫిను చేసి సామాను సర్దడంలో పడ్డాడు శ్రీధర్. అతనికిప్పుడు ఎంతో రిలీఫ్‌గా వుంది మాధవి అతనికి సహాయం

చేస్తోంది. హుషారుగా కబుర్లు చెబుతూ సర్దుతున్న సమయంలో తలుపు తట్టిన శబ్దం అయి లేచి వెళ్ళాడు శ్రీధర్ తలుపు తియ్యగానే కన్పించిన ప్రభాకర్‌ని చూసి ఆశ్చర్యపోయాడు. సభ్యత అడ్డు రాగా...."రండి" అన్నాడు ఇష్టం లేకపోయినా.

అతను ఎంతో చొరవగా లోపలికి వచ్చాడు. లోపలికి వస్తూనే సామాన్లు సర్దుతున్న మాధవివైపు ఆశ్చర్యంగా చూశాడు ప్రభాకర్.

"మీరు ఇల్లు మారుస్తున్నారా?" ప్రపంచంలో ఎనిమిదో వింత మొదటిసారిగా చూసినంతగా తబ్బిబ్బు అయిపోతూ అడిగాడు శ్రీధర్‌వైపు చూస్తూ.

"ఔనండి....ఈ ఇల్లు....పరిసరాలు నాకు నచ్చలేదు" ఎలాగూ వెళ్ళిపోతున్నాం కదాని తన కోపాన్నంతా జోడించి అన్నాడు.

"అలాగా....భలే తమాషాగా వుందండి. మేమూ ఇల్లు మారుతున్నాం" అన్నాడు చెప్పకుండానే అక్కడున్న కుర్చీలో కూర్చుంటూ.

అతని చేలో ఏదో పాకెట్ వుంది. శ్రీధర్, మాధవి చాలా ఆశ్చర్యపోయారు ముఖ్యంగా శ్రీధర్

"అదేమండీ" కుతూహలంగా అడిగింది మాధవి.

"ఏం చెప్పమంటారు." పుస్సురని నిట్టూర్చాడతను ఎంతో భారంగా.

ఏం మాట్లాడకుండా ప్రభాకర్‌వైపే చూస్తున్నాడు శ్రీధర్.

"అర్థం చేసుకునే జీవిత భాగస్వాములు దొరకడం నా దృష్టిలో గొప్ప వరమండి. ఎందుకంటే అది నాకు కరువయింది కాబట్టి" అన్నాడు నవ్వేస్తూ.

శ్రీధర్, మాధవి మొహాముహాలు చూసుకున్నారు ఇంతలో సోఫీ నోటితో దొరికిన చిత్తుకాగితాన్ని పట్టుకుని వచ్చింది తోక వూపుకుంటూ దాన్ని చూస్తూనే ప్రభాకర్ మొహంలో వెలుగు స్పష్టంగా చూశారిద్దరూ.

"మా ఇంట్లో అందరికీ ముఖ్యంగా నాకు, మా చెల్లికి బొచ్చుకుక్కలంటే

## శిశిరస్వరం

ఏకాంత స్మశానంలో
నీతోడి ఆలోచనల
కట్టెలు పేర్చుకుని
స్మృతుల చితికి
నిప్పంటించుకుంటే
చివరకు మిగిలిన
పిడికెడు విషాదం
ఎంత హాయిగా ఉందని!?
జీవితపు పుస్తకాన్ని
వెనక్కు తిప్పి చదువుకున్నప్పుడు
సాగిన కన్నీటి తీగల్ని
మీటిన 'సావేరి' రాగం
ఎంత తీయగా ఉందని!?
నీకు మననిచ్చిన పాపానికి
అదెప్పుడో ఉరిపోసుకుంది.
ఈ కట్టె మాత్రం ఇంకా
శిలువకు వేలాడుతూనే ఉంది!

గణేష్‌బాబు

చాలా ఇష్టమండి. మా చెల్లెలుకోసం మా నాన్నగారు బొచ్చుకుక్కని తీసుకొచ్చి ఇచ్చారు. మా దురదృష్టంకొద్దీ నాచెల్లెలు రెండేళ్ళక్రితం స్కూలునుంచి వస్తూ ఏక్సిడెంట్ అయి చనిపోయింది. మా చెల్లెలు అల్లారుముద్దుగా పెంచుకునే బొచ్చుకుక్క దానిమీద బెంగతో తొంక ర్లోనే చచ్చిపోయింది, అందుకే. " అతని గొంతు గాద్గదికమయింది.

శ్రీధర్, మాధవి కళ్ళప్పగించి చూస్తుంటారు.

"ఎక్కడ బొచ్చుకుక్క కన్పించినా నా మనస్సు అదోలా అయిపోతుంది. మీ శ్రీమతిగారు ఆ కుక్కతో ఆడు కుంటూంటే మా చెల్లెలు తన కుక్కతో ఆడుకుంటున్న దృశ్యాలు కళ్ళకి కట్టి నట్టు కన్పిస్తాయి. అందుకే ప్రతిరోజు సాయంత్రం ఆవిడ కుక్కతో ఆడు కుంటూంటే అలా నిలబడి చూస్తాను. దాంతో ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ వున్న మా ఆవిక ..." క్షణం ఆగి ఇద్దరివైపు చూసి "మరోలా అర్థం చేసుకుంది ఇలా చెప్పడానికి నేను జంకడంలేదు. ఎందుకంటే మీ ఇద్దర్ని చూసినక్షణం ఎలాంటిదో... మీరంటే నా కభిమానం ఏర్పడింది సద్భావం కల్గింది. మీతో స్నేహం చేసుకునే నా కోరిక కోరికగానే మిగలబోతోంది. ఎందుకంటే చెప్పానుగా పరాయి దవాళ్ళతో, అందులోకి కాస్త నయరుగా వున్న ఆడవాళ్ళతో మాట్లాడితే పెడర్థాలు తీసే మా ఆవిడ మూలంగా ఈ ఇల్లు ఖాళీ చెయ్యవల్సి వస్తోంది."

వింటూన్న శ్రీధర్కు తను భూమి లోకి కుంచించుకుపోతున్నంతపనయింది. పడమంది తన చుట్టూ నిలబడి అప హాస్యం చేస్తున్నట్టు ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

తను మాత్రం వాళ్లావిడకి ఏం తీసి పోయాడు? అనుమానం, ఈర్ష్యతో మాధవికి ఇష్టం లేకపోయినా తనీ ఇల్లు ఖాళీ చేస్తున్నాడు. అతను చాలా మంచి వాడై వుండాలి. లేకపోతే ఇలా వచ్చి చెప్తాడా? కళ్ళల్లో నీళ్ళు తిరిగినంత పన యింది శ్రీధర్కి. ప్రభాకర్ మొహంలోకి చూడడానికికూడా సిగ్గేసింది.

"అయ్యో యోయ్యో....ఎంతపని జరి గింది?" ఎంతో నొచ్చుకుంటూ అంది మాధవి సోనీ ఆమె పక్కనే కూర్చుని ప్రభాకర్కేసి చూస్తోంది. అతను చేతిలో వున్న కుక్కబిస్కెట్ల పాకెట్టు శ్రీధర్కి అందిస్తూ—

"ఈ కుక్కకి ఈ బిస్కెట్టు ఇస్తే ఎక్కడో వున్న నాచెల్లెలు ఎంతో సంతో షిస్తుంది. దానికి ఇలాంటి కుక్కలంటే ప్రాణం..." అతని కళ్ళల్లో పల్చగా నీరు తిరిగినట్టు శ్రీధర్ గమనించాడు. ఎంతో మనస్ఫూర్తిగా మాట్లాడాడు శ్రీధర్ ఆ క్షణంలో. ఆ క్షణంలో తన మనసులోని మాలిన్యాన్ని కడిగేసు కున్నాడు.

ఈర్ష్యా అసూయలు మనిషిని ఎంత తొందరపాటుకి, పొరపాట్లకి దారి తీస్తుందో అనుభవపూర్వకంగా తెలుసు కున్నాడు శ్రీధర్.

ప్రభాకర్కి కాఫీ తేవడానికి లోపలికి వెళ్ళింది మాధవి. శ్రీధర్ పొట్లం విప్పి సోనీకి తినిపిస్తుంటే ఎంతో తృప్తిగా చూశాడు ప్రభాకర్.



సీరియల్

# సౌభాగ్యలత

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి రామశాస్త్రి

(జరిగినకధ)

(మహేష్ విచ్చలవిడి ఖర్చు, తాగుడు కొంత షాక్ ఇచ్చింది శశిరేఖకి— ఐతే తన బిజినెస్ పథకాలు, పాలిటిక్స్, చెప్పి శశికి భ్రమ కల్గించాడు మహేష్. పై ఆఫీసర్ల ఇంటికి తన భార్యని సరదా కోసం పంపి 'కవర్' కోసం ఎదురు చూసేవాడు మహేష్-వకుళ శ్రీమంత్‌లు కుటుంబ బాధ్యతల కోసం పిక్నిక్ సరదాలు త్యాగం చేసుకున్నారు-పై ఆఫీసర్ భార్యలతో పేకాట ముగిసి "కవర్"తో బాటు మహేష్ ఆఫీసర్ భార్య పడక గదిలో మరచిన గాగుల్స్, సిగరెట్ లైటర్ తెచ్చింది శశి దాంతో వాగ్వాదం)

—ఇక చదవండి—

## 38

ఆఫీసులో అడుగిడుతూనే శ్రీమంత్ ఆశ్చర్యానికి లోనయ్యాడు.

హెడ్‌క్లర్క్, స్టెనో, డ్రాఫ్ట్స్‌మన్ అందరూ ఒకే టేబుల్ దగ్గర గుమిగూడి ఉన్నారు.

అప్పుడప్పుడు ఓవర్ టైమ్ చేయటం వారికి మామూలే. ఆవిధంగా డబ్బు ఆదనంగా లభిస్తుంది గనుక అటువంటి వారు ఆఫీస్ అవర్స్ తర్వాత అర్థరాత్రి వరకూ కూడా ఏదో వంకన పని కల్పించుకుని చేయడం క్రొత్త ఏమీ కాదు.

[illegible] ఇంతా ఎవరి స్థానంలో వారు పని చేయడం లేదు. అంతా ఒక తావున జేరి [illegible] డుపురాణీ?

శ్రీమంత్ [illegible] చూడగానే వారు ఏదో [illegible] అతడు స్పష్టంగా

గమనించాడు.

గమనించనట్లే ప్రక్క సెక్షన్ లోనికి దారితీస్తున్న శ్రీమంత్‌ను హెడ్ క్లర్క్ అడిగాడు.

"అన్నట్టు....మీరు సెలవు తీసుకున్నారు కదండీ? మరి ఇందులోనూ ఈ టైముతో ఆఫీసుకొచ్చారేమిటి?"

అడుగుతున్న తీరులో వినయంలేదు చూపూ, స్వరం వికటంగా వున్నాయి, శ్రీమంత్ వదనంలోనికి సూటిగా చూడ్డం లేదు ప్రక్క ప్రక్క చూపులు చూస్తున్నాడు ఏదో నేరం చేసి దొరికి పోతూన్నట్లు.

"ఆఁ. పనివుండి వచ్చానులే."

అని ముందుకు సాగి పోతూన్న శ్రీమంత్‌కు వెనుక నుండి అస్పష్టంగా విన వచ్చాయి అతడి మాటలు ఎవరితోనో గొణుగుతున్నట్లుగా!

"ఆఁ, జూనియర్ ఇంజనీరే గదా! వాడి మొఖం-వాదేం చేయగలడు?"

చివాలున వెనక్కి తిరిగాడు శ్రీమంత్.

"ఏమిటీ అంటున్నావ్?" విననట్టే అడిగాడు. తడబడిపోయి, త్వరగా మాటలు రాక నానా అవస్థా పడ్డాడు హెడ్‌క్లర్క్.

"ఆఁ....అ....ఏమీలేదండి. ఆఫీసర్స్‌కి "ఓవర్ టైమ్ మనీ" వుండదు కదా! అయినా మీరింత శ్రద్ధగా రాత్రింబవళ్ళూ తిరిగి చూడడం మీగొప్పతనమంటు న్నానండి."

"ఊఁ." అధిక ప్రసంగం కట్టిపెట్టించే అదలింపు స్వరంతో అన్నాడు.

"నేను సెలవు తీసుకోవడం లేదు ప్రస్తుతం, కేన్సిల్ చేసుకోవడానికి వచ్చాను ఏదీ నా అప్లికేషన్?"

"అయ్యో బాబోయ్!"

స్టెనో మెల్లగానే అన్నా గట్టిగానే విన్పించింది.

లోలోన కలిగిన విస్మయం పైకి ప్రదర్శితం కాకుండా [illegible] వుండ గలిగాడు శ్రీమంత్

"మీరు . .మీరు నిజంగానే సెలవులో వెళ్ళడం లేదా..!

వెల వెల పోతూన్న వదనంతో ఆందోళనను స్పష్టీకరించుతున్న స్వరంతో అడిగాడు హెడ్ క్లర్క్.

శ్రీమంత్ కను బొమ్మలు ముడిపడ్డాయి.

మనస్సు శంకాకులితమైనది.

"తాను వెళ్ళడం-వెళ్ళక పోవడం గురించి వీరి కందరికీ ఎందుకింత ఆందో ళన? అంతా మాయామోహితంగా వున్నదే!"

అటు యిటు చూచిన శ్రీమంత్‌కు మరింత ఆశ్చర్యమన్పించిన విషయం ఓమార్ ఇంకా తన ఆఫీస్ రూంలోనే వుండడం, ఏదో ముఖ్యమైన చర్చ జరుగు




తున్నట్లుగా గది బయట రెడ్ బల్బ్ వెలుగుతూన్నది.

"మానేజర్‌గారు ఆఫీసులోనే వున్నారా?" అన్నాడు హెడ్‌క్లర్క్‌తో.

"ఔనండి."

"మీటింగ్ జరుగుతూన్నట్టుంది. ఎవరితో? ఏ విషయంలో?"

ఇప్పటికి కాస్త ధైర్యాన్ని కూడదీసుకున్న హెడ్ క్లర్క్ పళ్లు యికిలించాడు.

"అవన్నీ చిన్న ఉద్యోగులం-మాకెలా తెలుస్తాయి లెండి?"

అందలి శ్లేషను గ్రహించిన శ్రీమంత్ కుపితుడై, సంభాషణను త్రుంచి వేసి, ప్రక్క వరండాలోనికి నడిచాడు.

అతడి ఆశ్చర్యం అధికమైంది.

ఆవరండాకూ కంపెనీ స్టోర్సుకూ మధ్యగల పెద్ద ఆవరణలో రెండు లారీలు ఆగి వున్నాయి.

ఒకదానిలో సిమెంటు బస్తాలు నింపుతున్నారు.

రెండవ లారీలోనికి ఇనుప ఊచలూ, స్టీలు గొట్టాలూ వగైరా త్వర త్వరగా మోస్తున్నారు.

అయితే, ఆ మోసేవారు కూలీలు కాదు! కంపెనీలో పని చేసే స్టోర్సు హెల్పర్సు, లారీ డ్రైవర్లూ, క్లీనర్లూను.

ఆ కంపెనీ మామూలు చిన్న సంస్థ ఏమీ కాదు, దేశంలో పేరైన సంస్థలలో ఒకటి, ఆ స్టోర్సు విలువ పాతిక లక్షలకు తక్కువ కాదు!

శ్రీమంత్ తనఆలోచనలలో వుండగానే స్టోర్స్ అధికారి బయటకు రావడమూ,

లారీల వెన నడుస్తూన్న అతడు ప్రాణ వాయువు స్తంభించినట్టే బిగుసుకు పోవ డమూ జరిగింది.

కొన్ని క్షణాలలోనే ఆ అధికారి ఆ అవస్థ నుండి తేరుకున్నాడు.

సరకు మోసే మనుష్యులతో నెమ్మదిగా ఏదో చెప్పి లోనికి వెళ్ళిపోయాడు. మరుక్షణమే ఆ మోసే వ్యక్తులుకూడ లారీలలో జొరబడడమూ, వెంటనే ఆ లారీలు అతి వేగంతో వెళ్ళి పోవడమూ ఒకేసారి జరిగాయి.

స్టోర్స్ ఉద్యోగి బయటకు వచ్చి, తాళాలు వేయించి, శ్రీమంత్ వెన చూచీ చూడనట్లు చూచి వేగంగా నడిచి కనుమరుగైనాడు.

"ఆ లారీలలో సరకు బాస్ బిల్డింగ్ స్పాట్ కేం!"

అని అడుగుతూ వరండా దిగి స్టోర్స్ ఇన్చార్జి వెన నడవబోయిన శ్రీమంత్ నిర్ఘాంతపోయి స్థాణువై నిలచాడు

ఎన్నడూ ఎరుగని మనిషిని చూచినట్లు అతడలా వెళ్ళి పోయాడేమిటి? ఏదో అదుపు వున్నట్లే అలా మాయమైనాడేమిటి?

ఆలోచిస్తూ తిరిగి ఇటు ఆఫీస్‌హాలులో అడుగిడిన అతడు మరింత విస్మయా నికి లోనైనాడు.

ఇంతలోనే ఆఫీస్ రూంలో అంతకు ముందున్న జనం ఎవరూ లేరు ఒక్క హెడ్ క్లర్క్ తప్ప. అతడు ఏవో కాగితాలు చూసుకుంటున్నట్లు నటించుతూనే మధ్య మధ్య, కళ్ళజోడు ముక్కు మీదకి జార్చి ఆపైనుండి దొంగ చూపులు చూస్తు న్నాడు శ్రీమంత్ వెన.

ప్రస్తుతం కుమార్ ఛాంబర్ ముందు అంతకు ముందున్న రెడ్ బల్బ్ కూడ వెలగడం లేదు!

శ్రీమంత్ కను బొమ్మలు ముడి పడ్డాయి.

ఏదో జరుగరానిది జరుగుతూన్నదనే అనుమానం ఏర్పడిం దతడి మనసున.

వడి వడిగా కిటికీ వద్దకు నడచి క్రిందకు చూచాడు.

మెయిన్ గేటు వైపు నడుస్తూన్న ముగ్గురు వ్యక్తులూ అతడికి పరిచితులే!

కుమార్, మహేష్, శివరాం!

వారు సరిగా గేటుకు దాటుతూన్న సమయంలో శరవేగంతో ఒక కారు వచ్చి వారి ముందు ఆగడం, ముగ్గురూ అందులో కూర్చొనగానే అది వచ్చినంత వేగం గానూ పరుగితడం—— త్రుటిలో జరిగి పోయింది.

సాగిపోతూన్న కారులోనుండి, చివరగా కూర్చున్న కుమార్ ముఖం ఒక్క సారి బయటకు పెట్టి బిల్డింగ్ వెన చూడడం శ్రీమంత్ స్పష్టంగా చూచాడు కిటికీనుండి.

"దుష్టత్రయం!"

అస్పష్టంగా ఉచ్చరించాయి అతడి పెదవులు.

ఏ మాత్రం ఆలస్యం కాకుండా త్వర త్వరగా మేడ దిగి అతడూ బయ

టకు వచ్చాడు.

తాను వారిని వెంబడించాలంటే తనవద్ద ఏవాహనమూలేదు, కంపెనీ జీప్‌లన్నీ షెడ్స్‌లోనే వున్నాయి. అయితే ఉద్యోగులు స్వయంగా నడపరాదు, డ్రైవరు ఉండాలి. కానీ రాత్రీ పగలూ ఎప్పుడూ అక్కడ వుండవలసిన డ్రైవర్లు ముగ్గురిలో ఒక్కడు కూడా లేడు!

ఇంతకుముందు లారీలో ఆ డ్రైవర్లను చూచి వుండడం హఠాత్తుగా గుర్తుకు వచ్చింది.

శ్రీమంత్‌లో పంతం పెరిగింది. ఒక బాధ్యతగల ఉద్యోగిగా తన కర్తవ్యం నెరవేర్చాలనే దీక్ష కలిగింది.

అప్రయత్నంగా పైకి చూచాడు.

మేడ బాల్కనీలో నిలబడి కళ్ళద్దాలు సవరించుకుంటూ తననే డేగచూపులు చూస్తున్న హెడ్ క్లర్క్ కనిపించాడు.

"ఇతడిని నాపై నిఘా వుంచారన్నమాట! ఏదో జరుగుతోంది ఏమిటది??"

రెండు నిముషాల అనంతరం దారినపోయే టాక్సీని పిలిచి బయలుదేరాడు.

అయితే, బిల్డింగ్ కన్‌స్ట్రక్షన్ ప్రదేశాన్ని జేరుకొన్న అతడికి అక్కడ ఏమీ సందడి కన్పించకపోగా భీకర నిశ్శబ్దంతో, విద్యుత్ లోపంతో అంధకారం వికృత నాట్యం చేస్తూన్నట్లనిపించింది.

టాక్సీని పంపివేసి, ఆలోచనా నిమగ్నుడై ఆ అసంపూర్తిగా వున్న కట్టడం చుట్టూ తిరిగి చూస్తున్న శ్రీమంత్, ఆ వెనుక భాగాన్ని జేరుతూనే చకితుడై, సవ్వడి సేయకుండా నిలిచిపోయాడు.

---

ఎవరో రహస్యంగా మాటలాడుకుంటున్నట్లు చిన్నగా గుసగుసలు ఆగి ఆగి వినవస్తున్నాయి

ఎవరై వుంటారు?

ఏమిటా మాట్లాడుకొనే సంగతులు?

"చిత్తం బాబూ....ఆc ఆc. అట్లాగే.. ఆc ఆc....ఎవ్వర్కీ తెలీదు. ఎంత మాట! హిహిహీ. తమదయ... .. "

అది అక్కడి కావలా దారుని కంఠస్వరంగా గుర్తించాడు శ్రీమంత్.

"ఊc. వెళ్తున్నాను. ఇది ఉంచు, జాగ్రత్త. లారీ వచ్చినప్పుడు, వెళ్ళినప్పుడూ... ఆc. . "

"అలాగే బాబూ."

వెళ్ళిపోతూన్న ఆ పొడవాటి వ్యక్తి సిగరెట్ వలిగించుకోవడంతో, శ్రీమంత్ ఆ సెకను కాలంలో ఆవ్యక్తిని లీలగా గుర్తించ గలిగాడు.

"అతడు........అతడు... .. మహేష్ కాదూ?"

కన్ను పొడుచుకున్నా కానరాకున్న ఆ చీకటిలో మరింత కనులు చికిలించి పరీక్షగా గమనించిన శ్రీమంత్ అనుమానం నిజమే అయినది

కావలాదారుతో కలసి వీధి చివరి వరకూ నడచి అక్కడ ఆగివున్న కారులో ఎక్కి వెళ్ళి పోయాడు.

కావలాదారు నిదానంగా నడచి వచ్చే వేళకు శ్రీమంత్ ఎవ్వరూ గుర్తించలేని ఒక మూల భాగంలో దాగి వేచి వున్నాడు ఇకా జరుగబోయే దానికోసం.

వది నిముషాలు గడిచే సరికి ఒక లారీ రావడమూ అందులోనుంచి నలుగురు మనుషులు దిగడం జరిగింది.

వారూ, కావలా మనిషీ రహస్యంగా అతి మెల్లగా మాట్లాడు కున్నారు

వెంటనే కావలా వ్యక్తి వారిని లోపలి భాగం లోనికి తీసుకు వెళ్ళి ఒక గది తాళం తీశాడు.

కన్పించీ కన్పించని ఓచిన్న గుడ్డి దీపం వెలిగించాడు

ఆవెలుగులో ఆ పెద్ద హాలులో వున్న సిమెంటు బస్తాలూ, వాష్ బేసిన్లూ, స్టీలు పైపులూ, పాలరాతి పలకలూ స్పష్టంగా కాన వస్తున్నాయి.

ఆ అన్నిటినీ తృప్తిగా కలయజూచుకున్నారు ఆగంతకులు

"హోరి ఈ గొప్పోళ్లు నల్ల గుండ! ఈ సరుకు జేరేసి ఇయ్యాల ఒకోక్కడు వందరూపాయలు కళ్ళజూత్తాం. వ్వారెవ్వా! మజాయే మజారా గోవిందూ. నాల్రోజుల దాక ఏవనీ జెయ్యక్కర్లేదు. హాయిగా సుక్కేసుకు పడుకోడవే!"

డ్రైవర్ హుషారుగా జెబ్బలు చరుచు కున్నాడు.

"మొదలెట్టండ్రా. యాభై సిమెంటు బత్తాలూ, రెండొందలు పాలరాయీ, ఆ పైపులు వద్దాల్లూ, ఆతొట్టిల వదీ—తొరతొరగా బండ్లో వదేయండి పొరపాటుని




అంతకు ముందు లారీకి ఎత్తబడిన సామానంతా పూర్తిగా ఆవరణలోని షెడ్డులో భద్రపరచడమూ జరిగింది.

గేటు మూసుకున్నది.

లారీ వెళ్ళిపోయింది.

శ్రీమంత్ మెదడు మొద్దుబారి, మరి ఆలోచించే శక్తి లేదని మొరాయించింది.

కుమార్ మహేష్‌ల రహస్యాలు మరిన్ని తెలుసుకోగలననీ, వారు ఈ సరుకు నిలువజేసే చోటులనూ, ఈ దొంగ సరుకును కొనుగోలు చేసే అవినీతి పరులనూ పట్టుకోగలననే ఆశతో వచ్చాడు ఆ లారీలో.

కానీ ఎక్కడికి వచ్చాడు? ఎక్కడకు తెచ్చింది ఆ లారీ?

తనను తన ఇంటికి వద్దగా చేర్చి వెళ్ళిపోయింది!

ఎంత అవమానం!

తన అశక్తతకు కుమార్ మహేష్ శశిరేఖలు కలసి విరగబడి నవ్వుతున్నట్లు అనిపించి కుపితుడై పోయాడు.

మహేష్ పనులు మామయ్యకు తెలుసా? ఆయన ఎటువంటివారు?

భగవాన్! అన్నీ సమాధానం లేని ప్రశ్నలే!

చాలాసేపటికి తన ఆలోచనల నుండి తేరుకొన్న శ్రీమంత్ వకుళను గమనించాడు.

మంచం నడుమను మోకాలిపై గడ్డం ఆన్చి, చేతులను కాళ్ళచుట్టూ బంధించి పొంకగా కూర్చునివున్న వకుళ విశాలనేత్రాలలో కోటి కోర్కెలు నాట్యమాడుతున్నాయి.

అంతకు మించిన ప్రశ్నలు.

...ంతికంగా వచ్చి చెంత కూర్చున్నా లేకానీ అసలది ఆలోచన లేదు...

"శ్రీమంత్!"

"ఊఁ."

ఇప్పటికే అతడిదృష్టి ఇటు తిరగటేదు. తన అలంకరణనుగాని, పూజరను గానీ, అనలు తాన అతడి ఒడిలో వున్నట్లుగానీ అతడు గమనించగల స్థితిలో లేదని గ్రహించింది వకుళ.

మరలా శశిరేఖవల్లగానీ, మహేష్ వల్లగానీ అవమానింపబడ్డాడా శ్రీమంత్? అటువంటి సమయాలలోనే అతడింత గంభీరంగా వుంటాడు.

ఏమయినా కావచ్చు.

కానీ ప్రతిదానికీ మనస్సు ఇంతగా పాడుచేసుకొని, బయటి విషయాలతో స్వజీవితాన్ని నిర్లక్ష్యం నిరర్థకం చేసుకొనే అతడి మన స్తత్వాన్ని ఏమని వ్యాఖ్యానించాలి?

రేయి మూడవ రూము గడచింది.

గోడనున్న పాత గడియారం కొట్టిన గంటలకు సుషుప్తి నుండి మేల్కొంచి నట్లు, జాగ్రదవస్థకు వచ్చిన శ్రీమంత్ విపరీతమైన అలజడికి లోనైనాడు.

తన చేతులలో నిదురిస్తున్న వకుళ!

ఆమె కన్నె హృదయం ఎంతగా రోదించిందో ఆమె చెంపలపై ఎండిన కన్నీటి సెలయేళ్ళ ఆనవాళ్ళే చెబుతున్నాయి.

పశ్చాత్తాప దగ్ధమైన హృదయంలో ప్రేమాతిశయం పొంగి పరవళ్లు త్రొక్కింది.

"వకుళా!"

చెవిలో ధ్వనించిన ఆ మధుర సంబోధనలో కురిసిన జన్మ జన్మల అనురాగం వకుళను ఆశ్చర్యచకితను చేసింది. కనులువిప్పి ఆనందంగా-అతగాడుచూచింది.

"ఇది....ఇది కలా నిజమా శ్రీమంత్?"

"నిజం! నిలచి పోయే నిజం!"

అంటున్న ఆమెత్తని కంఠంలో అవధులులేని ఆర్ద్రతాన రాగాలు సంగీతమై వినవస్తున్నాయి.

వకుళ జీవితంలో వసంతోదయమైంది!

ఆమె ఎదురుచూచిన క్షణం-అమూల్యమైన క్షణం ఏతెంచిది, శాశ్వతమైంది!

ఆమె నిరీక్షణకు అపురూపమైన వరదానం లభించింది.

"నేను....నేను ఎంత అదృష్టవంతురాలిని శ్రీమంత్!"

ఆమె పెదవులు అస్పష్టంగా ఉచ్చరించాయి. ముకుళిత నేత్రాలనుండి ఆనందాశ్రువులు జాలు వారాయి.

"మనం... మనం అదృష్టవంతులం అను వకుళా. ఇక నువ్వూ నేనూ వేరు కాదు."




# మహాభాగవతం

భాగవతం అనగానే బమ్మెర పోతన్న గారే జ్ఞాపకం వస్తారు. రామాయణం అనగానే వాల్మీకి. భారతం అనగానే కవిత్రయం... విశేషం ఏమిటంటే కృష్ణలీలలే భాగవతం అని చాలామంది అనుకోడం విన్నాను, వింటూ ఉంటాను. అలా అనేవారి అమాయకత్వానికి నవ్వుకుంటాను... గజేంద్ర మోక్షం, ప్రహ్లాద చరిత్ర, బలిచక్రవర్తిని అహ్వానంగా సర్వోత్తమ స్థాయిని నిలబెట్టిన వామనావతార కథ....ఇవన్నీ భాగవతంలోనివే. అయితే అవుగాక! 'భాగవతం' అంటే కృష్ణలీలలే....

ప్రస్తుతం నాలుగు మాటలు నాచేత వ్రాయించుకుంటూన్న యీ 'మహాభాగవతం' బమ్మెర పోతన పద్యకృతికి వ్యావహారిక రూపం-ఈ రూపం సంతరించిన వ్యక్తి (నా అభిప్రాయంలో అదృష్టవంతుడు) శ్రీ నాయుని కృష్ణమూర్తి. అడుగులోనే హంసపాదు కాదు గాని అనక తప్పదు భాగవతం కేవలం పద్యకృతీ కాదు, గద్యకృతీ కాదు. చంపువు. తరువాత వచ్చే భాగంలో 'గద్య పద్యాత్మకృతికి' అని వెయ్యవలసిందని సలహా యిస్తున్నాను.

**మహాభాగవతం**
(మొదటి భాగం)
రచయిత : నాయుని కృష్ణమూర్తి
**విజయవాణి పబ్లిషర్స్**
చౌడేపల్లి-517257
చిత్తూరు జిల్లా, ఆం. ప్ర.
వెల : రూ. 15/-

అలాగే కృష్ణుణ్ణి పీతాంబరుడుగా చెప్పాలిగాని శ్వేతాంబరుడుగా చెప్పడం గ్రాహ్యం కాదు. కృష్ణుని పీతాంబరత్వం అతి ప్రసిద్ధం.

మొదటినుంచి ఏడు స్కంధాల భాగవతం వచనరూపంలో శ్రీ కృష్ణమూర్తి సంతరించడంలో కృతార్థుడైనాడని చెప్పడం సామాన్యోక్తి. గోధుమనాగు సమతలంలో సంచరించినట్లూ క్రొక్కారు మబ్బుపై పసిడి పన్నుల మెరుపు ప్రసరించినట్లున్నూ భాషాయోష యీ కృతిలో చక్కని వాహ్యాళి సాగించింది. భాష వ్యావహారికమైనా తగిన బరువూ [illegible] కలిగి చదువరిని చల్లగా ముందుకి నడి

పిస్తుంది.

భాగవతం కేవలం తత్వగ్రంథం. కాదని ఎవరైనా అంటే చదివి చూడండి అని సమాధానం.

తాత్విక విషయం సంస్కృత భాషలో చెప్పడానికి తగిన పదాలున్నాయి. మిగతా దేశభాషలకు అంత పదసంపన్నత ఉందని నేననుకోలేను. అలాటి విషయం కూడా యీ కృష్ణమూర్తి సున్నితమైన పదబంధంలో సఘటించి సులువుగా గ్రహించడానికి చెప్పిన తీరు యీ రచనను మరల మరల ఆసక్తితో చదివిస్తుందని భాగవత రచయితగా నేను నిస్సందేహంగా చెప్పగలను.

భగవంతుని నాలుగురకాల వ్యూహాలనూ కృష్ణమూర్తి వివరించిన విధం మెచ్చదగినది.

అలాగే ఖగోళం వివరించిన తీరు ప్రశంసనీయం. ప్రహ్లాద చరిత్రలో పోతనామాత్యుడు చూపిన వాక్ప్రయోగ దక్షత కృష్ణమూర్తి అనువాదంలో సుగమ మయిందని తెలుసుకున్నాను.

అక్కడక్కడ మాటల వాటం పోతనగారి పద్యానికి దండాన్వయంలాగా వుంది. నరనర సాగే శక్తి మరికొంచెం కృషి చేస్తే ప్రస్ఫుటమవుతుంది.

ముందుముందు యచ్ఛబ్ద తచ్ఛబ్దాన్వయ ధోరణి రాకుండా తెలుగుతనానికి సాజమైన త్రోవను వాక్యనిర్మాణం సాగిస్తే కృతి సువర్ణాకృతి అవుతుంది.

ప్రాక్తన, జన్మపుణ్య సంస్కారం వల్ల యిలాటి గ్రంథరచన చెయ్యాలనే సత్సంకల్పం కలుగుతుంది. ఈశ్వరుడు అనుగ్రహించి రెండవ భాగం కూడా శ్రీ కృష్ణమూర్తిచే అచిర కాలంలో వ్రాయించగలడని భావిస్తున్నాను.

ఈ మొదటి భాగం ఆస్తికులకే కాకుండా నాస్తికులకు కూడా పఠన యోగ్యమని నా అభిప్రాయం. ముఖచిత్రం ముద్దుగా ఉంది.

—యామిజాల పద్మనాభస్వామి

---

## "జానపద రామాయణం"

## శ్రీ టి. గోపాలకృష్ణారావుకు డాక్టరేట్

"తెలుగు కన్నడ జానపద రామాయణాలు" అనే తులనాత్మక అంశం మీద సమర్పించిన సిద్ధాంత రచనకు మైసూరు విశ్వవిద్యాలయం డాక్టరేట్ ఇచ్చి, సత్కరించింది. చిత్రం ఏమంటే వాల్మీకి రామాయణ మహాకావ్య రచనాపూర్వమే రామాయణగాథ జానపదులలో ప్రచారంలో వున్నదనీ, వాటిలోని పట్టాల్ని పరిష్కరించి వాల్మీకి మహర్షి వెలుగులోనికి తెచ్చాడనీ నిరూపణ చేయడం జరిగింది. సీత, శూర్పణఖ, ఊర్మిళ, మండోదరి మొదలయిన పాత్రలు జానపదుల ప్రత్యేకతని సూచిస్తాయనీ విశేషించారు. దేశ, విదేశ భాషల్లో వున్న రామాయణాల్లో పై ఆధారాలు లభిస్తాయని నిరూపణ చేయబడింది.






ఆమె చూసింది—సిగ్గు పడ్డాను
ఆమె నవ్వింది—పరవశించాను.
కనుసైగ చేసింది—కలవరపడ్డాను.
కావ్య గీతం పాడింది—సతమతమయ్యాను.

○ ○ ○

'భగవాన్! ఈసారన్నా కరుణించు!' ప్రార్థించాను మనసులో. కొల్లేరు చాంతాడంత ఉంది క్యూ కిరోసినాయిల్ క్యూలా!!

"నెక్స్ట్....నెక్స్ట్...నెక్స్ట్!!!

నా ముందు నెక్స్ట్ అయింది-నా వెనుక నెక్స్ట్ అయింది.

ఫలితం—ఏమో—ఎవరికో!!

○ ○ ○

కన్ను, కన్ను-కలిసింది.
మనసు, మనసు-కలిసింది.
వయసు, వయసు-కుదిరింది.
వలపు, వలపు-పెరిగింది.

○ ○ ○

"చూడు. మిష్టర్....!"
"నా పేరు అప్లికేషన్‌లో వుందా?"
"ఓ. ఐ సీ!"
"చూడు. మిష్టర్....!"
"చూస్తూనే ఉన్నాను!"
"ఐ మీన్... ఆ చూడ్డం కాదు, సరే! చెట్టుమీద పక్షులెన్నుంటాయి?"
"చెట్టుమీద ఉన్నన్ని!"
'నువ్వెక్కి వచ్చిన మెట్లెన్నుంటాయి'!
"నేను దిగబోయేటన్ని!"
"ఈ దేశంలో.... ఈరోజున.... ఈ గంటలో .ఈనిముషంలో.. ఈసెకనులో ....మనదేశ జనాభా ఎంత?"
"కొన్నికోట్లు....కొన్నిలక్షలు....కొన్ని వేలు....కొన్నివందలు....కొన్ని పదులు ....

---

## ఎం. సుదర్శనరావు

---

కొన్ని ఒకట్లు!!"

"మనిషికి ఆకలి ఎంతుంటుంది?"

"ఏ డిగ్రీ నడిగినా చెబుతుంది!"

"నహోజ్-నీడిగ్రీ ఏమనిచెబుతుంది?"

"ఈడిగ్రీలో వ్రాసివున్న ఒక్కొక్క అక్షరం... ఒక్కొక్క అన్నంమెతుకై; ఆ అన్నం మెతుకులన్నీ కలిపితే ఒక అన్నంముద్ద - అలంటి అన్నంముద్దలు కడుపునిండేవరకూ తింటే, ఆ మనిషికి అంత ఆకలి ఉంటుందని నా అభిప్రాయం!"

"నవ్వు కమ్యూనిష్టువా!"

"కాదు... హ్యూమరిష్టుని!!"

"నీ వాచ్‌లో టైమ్ ఎంతయింది?"

"ముందు మీ వాచ్‌లో టైమ్ ఎంతో చెప్పండి!"

"వాట్ ..అంటే....నీ ఉద్దేశ్యం!"

"ఈ ప్రపంచంలో ఏమనిషి భావాలు ఇంకో మనిషి భావాలతో సరిపోనట్లే ఏ వానీ-ఇంకోవానీ టైంతో సమానంగా ఉండదు. ఖచ్చితమైన టైం కావాలంటే- ఒక స్లో వాచీకీ, ఒక ఫాస్ట్ వాచీకీ - సరాసరి కట్టుకోవాలి.. ఏదైనా అంతే!

"అంటే . నీకంటూ ఓఅభిప్రాయం లేదా!"

"నా అభిప్రాయానికి వేల్యూలేదని.... నా డిగ్రీ మె చెబుతుంది!"

"నీ డిగ్రీ విలువెంత?"

"ఓ, సెకను చలికాచుకునేంత!"

కొంతసేపు నిశ్శబ్దం. అధికారపు ముసుగుల... ....ఆకారాలు కొంతసేపు తర్జన-భర్జనలు.

"చూడు మిష్టర్.. .!"

"యస్ సార్!"

"నో ...యూ ఆర్ సెలెక్టెడ్!!"

"థ్యాంక్యూ.. . థ్యాంక్యూ సర్!!"

o o o o

ఈల వేశాను... గోలచేశాను పాతాళాన్నుంచి భూమిమీదకు వచ్చాను. హృదయం పొంగింది. అందుకే ఆమెకో ఉత్తరం, ప్రాణాను-ఆమెకూడా వ్రాసింది. నీత్తరాలతోటలో ఉత్తరాలు దొరికాయి . లలలా... లలలా!!

బొత్తు-బొత్తు పెరగింది.

కిలోలు-క్వింటాలు!!

మత్తు-మత్తు కలిగింది.

గంజాయిలా-హెరైజన్‌లా!!

o o o

ఆనందం-ఆనందం!!

నోట్లు-నోట్లు-పచ్చనోట్లు!!

ఆశ్చర్యం-ఆశ్చర్యం!!

మూడో అంకెలాముదుచుకున్న నాకు నాలుగంకెంజీతం.

జీతాల-జీవితాలు!

కానితాల కొద్ది సరదాలు!!

మధురం-మధురం-జీవితం మధురం

సుఖం-సుఖం-జీవితం సుఖమయం

ఆమె గుర్తుకొచ్చింది-నడిచాను వడి. వడిగా!!

ఆమె పలికింది-శారికం,

ఆమె వంగింది - కురంగం.

ఆమె నడిచింది-మరాళం.

ఆమె కులికింది-మయూరం.

o o o

అలా కొన్నేళ్ళు-!

కొన్నాళ్ళ తర్వాత!!

ఆశయానికి-ఆశ ఊపిరి.

త్యాగానికి-ప్రేమ ప్రాణం.

అందుకే ఆకర్షణ!
మనసు ప్రేరణ!!
కొన్ని అవయవాల సంఘర్షణ
ప్రళయం కాని ప్రణయం!
అదే-నా జీవితాశయం!!
దూరంగా-ఆమె!
దగ్గరకు వచ్చేస్తోంది!!
కళ్ళతో తాగే అందం!!
ఆమె వదనం-పాదరసం.
ఆమె అధరం-మధురసం.
ఆమె నయనం-హరిచందనం.
ఆమె గళం-శంఖం.
ఇంకా - - - -?
మనసుకో ఎక్స్‌రే!
వయసుకో సెక్స్‌రే!!

ం ం ం

మోషన్-ఫ్రీమోషన్!
కాదు....కాదు....నాకొచ్చింది ప్రమోషన్!!
నా-ఆనందానికి-- హద్దులు---లేవు.
పరుగెత్తాను-ఆమె దరికి!!
ఏడడుగులు నడిస్తే-నడిచాను.
చేయి-చేయి కలిపితే-కలిపాను
భుజంమీద చెయివేస్తే-ఓపాట-పాడేను.
"ఐ లవ్ యూ యూ లవ్ మి!"
"ఐ లైక్ యూ-యూ లైక్‌మి!"
"ఐ వాంట్ యూ-యూ వాంట్ మి!"
"ఐ కిస్ యూ-యూ కిస్ మి!!"
-అదేదో పాట-పాడేశాను.
నడుం మీద చేయి వేస్తే-ఓఆట ఆడేశాను.

బాత్ రూమో-బాత్ రూమో
రాకండ్ రోలో- రోలు- రోకలో.
అదేదో ఆట-ఆడేశాను.

ం ం ం

రంగు, రంగుల దీపాలు-మంగళ తోరణాలు.
బాజా, భజంత్రీలమంగళ వాయిద్యాలు.
వేదమంత్రాలు-మంగళ సూత్రాలు!
మూడు ముళ్లు-రాగ బంధాలు!!
ఆశీస్సులు-దీవెనలు,
అక్షతలు-శ్రీరామరక్షలు.

ం ం ం

అగరు ధూమాలు-మత్తు గొలిపే మరుమల్లెలు.
అలంకారాలు-నూత్న వస్త్రాల రెపరెపలు.
అందించిన పాలగ్లాసు!
నవ్వు-చిరునవ్వు!!
యవ్వనం-నవ యవ్వనం.
వలపుల తలపులు-మూసిన తలుపులు
అదో ఆనందం-అదో అనుభూతి
ఈదేరే కోరికల వెచ్చని ఉత్సాహం!!
గుండె అగినంతగా.

ం ం ం

చాలు-చాలు-చాలు
నాకీ జీవితం చాలు!
చాలు-చాలు-చాలు

నాకి క్షణం వదివేలు!!

"చాలు-చాలు-చాలు!!"

"ఏం చాలురా!" రూమ్మేటు అరుపు

"చాలు-చాలు-చాలు!!"

"ఒరేయ్! నిన్నేరా! ఏంచాలురా!" రూమ్మేటు అరిలింపు

కల చెదిరింది-కథ మారింది.

అదిరిపడి లేచాను అయిపోయింది. అంతా అయిపోయింది. మామూలే! మళ్ళీ మామూలే!!

స్థితి తెలిసింది-గతం మెదిలింది.

o o o

చదువు-యూనివర్సిటీ-డిగ్రీ- ఉద్యోగాన్వేషణ.

"నో వేకేన్సీ" - "నో రికమండేషన్స్"-"నో మామూల్స్!!!"

అదీ కథ-ఇదే వ్యథ.

o o o

"ఏం చాలురా!" "చెప్పవేం?"

"ఈ జీవితం చాలు!" ఎక్కడో మత్తులో గిచ్చాడు-మత్తు వదిలింది.

"ఇదంతా కలా!"

"ఏం కలరా?"

"కాదు....కాదు....నిజం!"

"ఏం నిజం?"

"ఈ జీవితం!"

"ఏం జీవితం?"

"నా కల!"

"ఏం కల?"

"నా బొంద!!"

"అయితే వదుకో!!!"

వదుకుంటూ పాడుకున్నాడు. కన్ను మూసినా ఆమె రూపమే-కన్ను తెరిచినా ఆమె రూపమే!"

టాకింగ్ - టాకింగ్ - టాకింగ్-సో నియర్!

వాకింగ్-వాకింగ్ వాకింగ్-సోఫార్!

డ్రీమింగ్-డ్రీమింగ్-డ్రీమింగ్ - సో డియర్!!!

నిద్ర చెదిరిన నా రూమ్మేటు:-

బెగ్గింగ్ - బెగ్గింగ్ - బెగ్గింగ్ - నో ఫియర్!?!

"నో, నెవ్వర్-నో, నెవ్వర్-నో, నెవ్వర్!!"

అరిచాను రూమ్ అదిరేలా! రూమ్మేటు నవ్వుతూ నావంక చూచాడు-నేను సిన్నా హాయంగా చూచాను. నవ్వాడు-నవ్వాను-నేనూ నవ్వాను.

యిరువురి కన్నుల్లో బాష్పబిందువులు.

అవి క్రిందకు జారవు-జారలేవు.

జారీ-జారీ-అవీ అలసిపోయాయి.

ఆ చిరునవ్వుల వెనుక -

చెదరిన కలల-నిరుద్యోగ బ్రతుకుల-దీనారావాలు!!

ఇలా-ఎన్నో, ఎన్నెన్నో, ఎన్నెన్నెన్నో-!!

అలా-ఎందరో, ఎందరెందరో, ఎందరెందరెందరెంద....



Edited & Published by V. Leelavathy Raghavaiah, at 3-5-1039/1 Narayanaguda, Hyderabad-20 & Printed by P. Ramakrishna at Raghava Printers, 1-8-4/1/1, Chikkadpalli, Hyderabad-500 000.




# కాని మీరు వదిలించుకోవల్సింది ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండు అయితే మీకు కావల్సిన షాంపూ, క్లినిక్‌ని మించినదై ఉండాలి మరి







# క్లినిక్ స్పెషల్

క్లినిక్ మీ చుండుపై పనిచేసిందని, మీకు సరిగా సరిపడిందని మాకు తెలుసు. అయితే ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుగల వారున్నారన్న సంగతీ మాకు తెలుసు.

అందుకే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండును తొలగించేందుకు కొత్త సూత్రీకరణను ప్రవేశపెట్టాం. క్లినిక్ మించినదది.. దాని పేరు క్లినిక్ స్పెషల్ అ! ఇప్పుడు రెండు క్లినిక్ షాంపూలు ఉన్నాయి. మామూలు చుండుకు క్లినిక్... ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుకు క్లినిక్ స్పెషల్. ఇక ఈ రెండింటి కలయిక చుండు సమస్యలన్నింటికీ నివారణే మరి.

హిందుస్తాన్ లిమిటెడ్ వారి
విశిష్ట ఉత్పాదన